అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# యథార్థాల అద్దంలో

# కామన్ సివిల్ కోడ్

కామన్ సివిల్ కోడ్ గురించిన వాదనలు స్వాతంత్ర్యానికి ముందు నుంచి వినబడుతూ వస్తున్నాయి. కామన్ సివిల్ కోడ్ అన్నది రాజ్యాంగానికి సంబంధించిన ఓ సమస్యగా తయారయ్యింది. స్వాతంత్ర్యానంతరం దేశం కోసం తయారు చేసిన రాజ్యాంగంలో యూనిఫామ్ సివిల్ కోడ్ గురించి ఒక అధికరణాన్ని చేర్చడం జరిగింది. రాజ్యాంగంలో ఆదేశిక సూత్రాల క్రింద ఉన్న 44వ అధికరణం ఇది.

## సంవిధానం - అనవసర పొడిగింపులు

సంవిధానం అన్నది ఒక అత్యున్నత స్థాయికి చెందిన రాజ్యపత్రం. ఒక జాతీయ ప్రభుత్వాన్ని (లేదా ఒక సంస్థను, సంఘాన్ని) నడుపడానికి అవసరమైన మౌలిక సూత్రాలను నిర్ధారించడం సంవిధానం లక్ష్యం. ఈ లక్ష్యం దృష్ట్యా సంవిధానం సంక్షిప్త రూపంలో ఉండడమవసరం. ఎందుకంటే, సంవిధానం నిడివి పెరిగిన కొద్ది అందులో అభిప్రాయ భేదాలు కూడా పెరుగుతూ ఉంటాయి. ఫలితంగా తరచూ సవరించవలసి వస్తుంది. సంవిధానం గౌరవం క్రమేణా నశిస్తుంది. సంవిధానం సుదీర్ఘంగా, సంక్లిష్టంగా ఉన్నందువల్ల చివరికి దాని గురించిన అవగాహన కొద్ది మంది నిపుణులకు మాత్రమే పరిమితమైపోతుంది. సాధారణ పౌరులకు దాని గురించిన జ్ఞానం, ఆసక్తి లేకుండా పోతుంది.

అందువల్లనే ప్రముఖ అంతర్జాతీయ సంవిధానం శాస్త్ర పండితుడు, విస్కాన్సిన్ యూనివర్శిటీ ప్రొఫెసర్ డేవిడ్ ఫెల్ మాన్ మొదలు ప్రముఖ భారతీయ రాజ్యాంగ నిపుణుడు నాని ఫాల్కివాలా వరకు అందరూ సంక్షిప్త రాజ్యాంగాన్ని సమర్థించారు.

వర్తమాన ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలన్నింటా సంవిధానాలు లేదా రాజ్యాంగాలు సంక్షిప్తంగానే ఉన్నాయి. ఉదాహరణకు అభివృద్ధి చెందని దేశం 'జార్జియా' కొత్త రాజ్యాంగంలో అయిదు లక్షల (5,00,000) పదాలు ఉండగా, అభివృద్ధి చెందిన అమెరికా రాజ్యాంగంలో కేవలం ఏడు వేల పదాలు ఉన్నాయి. అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రప్రథమ దేశంగా ప్రస్తుతం ఎంచబడుతున్న జపాన్ రాజ్యాంగమయితే మరీ చిన్నది. (5/85-86)

ఇక భారత రాజ్యాంగం విషయానికి వస్తే ప్రపంచంలో ఇది సుదీర్ఘ రాజ్యాంగం. పన్నెండు వివరణాత్మక షెడ్యూళ్ళు కాక, అసలు రాజ్యాంగం 395 పేజీలు ఉంది. కాగా, అనేక అధికరణలకు ఉప అధికరణలున్నాయి. నవంబరు 1949 నుంచి ఇప్పటి వరకు రాజ్యాంగానికి సుమారు 80 సంస్కరణలు జరిగాయి. ఇంకా సంస్కరణలు జరగాలన్న డిమాండ్ వినిపిస్తూనే ఉంది.

సుదీర్ఘ రాజ్యాంగ రచన సరికాదనడానికి ఇంతకన్నా సాక్ష్యం ఏ కావాలి? ఇన్ని సంస్కరణలు జరిగినా ఈ "సమగ్ర" రాజ్యాంగం దేశాన్ని అభివృద్ధి పథాన నడుపలేకపోయింది.

భారత రాజ్యాంగ రచనా సంఘానికి అధ్యక్షుడుగా (1946-49) డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఉండేవారు. ప్రస్తుత రాజ్యాంగం ఆయన అధ్యక్షతనే రూపొందినప్పటికీ ఆయన 1949 నవంబర్ 26న దీనిపై సంతకం చేసినప్పటికీ, సుదీర్ఘ రాజ్యాంగాన్ని ఆయన వ్యతిరేకిస్తూనే వచ్చారు.

In his Valedictory address to the Constituent Assembly Dr. Rajendra Prasad said that everything cannot be written in the Constitution and hoped for the development of healthy

conventions. But these have not been developed and everything has to be written in the Constitution.

రాజ్యాంగ రచనా సంఘంలో డాక్టర్ రాజేంద్రప్రసాద్ వీడ్కోలు ప్రసంగం చేస్తూ రాజ్యాంగంలో ప్రతి విషయాన్ని వ్రాయలేమని అన్నారు. ఆరోగ్యప్రదమైన సంప్రదాయాలు ఏర్పడతాయన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తపరిచారు. కాని అలా జరుగలేదు. అందుకు విరుద్ధంగా ప్రతి విషయాన్ని రాజ్యాంగంలో చేర్చాలన్న భావం బలపడింది. *(హిందూస్తాన్ టైమ్స్-24మే 1995)*

ఏ రాజ్యాంగంలోనయినా సరే అనవసర అధికరణలు చేర్చడం వల్ల అనవసర పొడిగింపులు జరుగుతాయి. భారత రాజ్యాంగంలో ఇలాంటి అనవసర అధికరణలు అనేకం ఉన్నాయి. జాతీయ పాలసీ ఆదేశిక సూత్రాలలోని 44వ అధికరణ అలాంటిదే. ఈ అధికరణ కామన్ సివిల్ కోడ్‌కు సంబంధించినది. ఈ అధికరణలో భారత ప్రజలందరికీ ఒకే సివిల్ కోడ్ వర్తింపజేయడానికి ప్రభుత్వం కృషి చేయాలని సూచించారు.

The State shall endeavour to secure for the citizens a Uniform Civil Code throughout the territory of India.

దేశ ప్రజలందరికీ ఒక విధమైన ఆహారపు అలవాటు ఉండేలా ప్రభుత్వం కృషి చేయాలనడం ఎంత రాజ్యాంగ విరుద్ధమో రాజ్యాంగంలోని ఈ అధికరణ కూడా అంతగా రాజ్యాంగ విరుద్ధమైనదే. దేశంలోని స్త్రీ పురుషులు, వృద్ధులు, పిల్లలు అందరూ ఒకే విధమైన ఆహారాన్ని భుజించడం, ఒకే విధమైన దుస్తులు ధరించడం ఎలా అసాధ్యమో అదే విధంగా ఒక పెద్ద దేశంలోని స్త్రీలు, పురుషులు అందరూ వివాహ వేడుకను ఒకే తీరుగా ఆచరించడం కూడా అసాధ్యం. చట్టాల ద్వారా అలా ఒత్తిడి చేసినప్పటికీ ఇది సాధ్యం కాదు. రాజ్యాంగం అన్నది జాతీయ పాలసీలకు సంబంధించిన మౌలిక నియమాలను నిర్దేశించడానికి ఉద్దేశించిందే తప్ప వ్యక్తుల వ్యక్తిగత వ్యవహారాల్లో తలదూర్చి, వ్యక్తిగత అభిరుచులను నాశనం చేసి అనవసరపు సాధరణీకరణం చేయడానికి ఉద్దేశించినది కాదు.

ఏదైనా అంశం ప్రచురణలోకి వస్తే చాలా మంది అది నిజమని నమ్ముతారు. రాజ్యాంగంలోని 44వ అధికరణ పరిస్థితి ఇలాంటిదే. అందుకే చాలా మంది ఈ అధికరణాన్ని ఉటంకిస్తూ దేశంలో కామన్ సివిల్ కోడ్ అమలు జరుపడానికి పార్లమెంటు చట్టం చేయాలనీ, దాన్ని దేశవ్యాప్తంగా వర్తింపజేయాలని డిమాండ్ చేస్తుంటారు.

## నెహ్రూ నివేదిక

పూర్తి దేశానికిగాను కామన్ సివిల్ కోడ్ రూపొందించాలన్న ఆలోచన చాలా కాలం నుంచి ఉంది. బహుశా ఈ ఆలోచన మొదటిసారిగా 1928లో నెహ్రూ నివేదికలో కనబడింది. నెహ్రూ నివేదిక స్వాతంత్ర్య భారత రాజ్యాంగానికి ముసాయిదా ప్రతి. దీన్ని ప్రముఖ రాజ్యాంగ నిపుణుడు మోతిలాల్ నెహ్రూ రూపొందించారు. స్వాతంత్ర్య భారతంలో వివాహ వ్యవహారాలను ఒకే విధమైన చట్టం క్రిందికి తీసుకురావాలని ఈ ముసాయిదా రాజ్యాంగంలో ఒక ప్రతిపాదన ఉంది. అప్పట్లోనే ఇస్లామ్ పండితులు దీన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. అంతేకాదు, అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం కూడా దీనిని అంగీకరించలేదు. ఈ ప్రతిలో Dominion States గురించిన ప్రస్తావన ఉంది. ఇది ఆంగ్లేయులకు అంగీకారయోగ్యం కాని విషయం.

ఆ తరువాత 1939లో ఈ విషయమై చర్చించడానికి లాహోర్‌లో కాంగ్రెస్ సమావేశం జరిగింది. నెహ్రూ నివేదిక ఆచరణ యోగ్యమైనదా కాదా అన్న అంశంపై చర్చించిన ఆ సమావేశం ఈ నివేదికను రద్దు చేసింది.

## సుప్రీం కోర్టు తీర్పు

1985లో సుప్రిం కోర్టు న్యాయమూర్తులు కామన్ సివిల్ కోడ్ గురించి అభిప్రాయాలను ప్రకటించడం ప్రారంభించిన తరువాత నుంచి ఈ సమస్య సరికొత్తగా ప్రాధాన్యతను సంతరించుకుంది. సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి వై.వి. చంద్రచూడ్ తీర్పుతో ఈ విషయమై న్యాయపరమైన

సంవాదాలు ప్రారంభమయ్యాయి. 1985లో ఆయన ముహమ్మద్ అహ్మద్ వర్సెస్ షాబాను కేసులో ముఖ్యమైన తీర్పును ఇచ్చారు. ఈ తీర్పులో ఆయన రాజ్యాంగంలో 44వ అధికరణ ప్రకారం శాసనం చేయవలసిన సమయం ఆసన్నమైందని ప్రతిపాదించారు. కామన్ సివిల్ కోడ్ జాతీయ సమైక్యతకు దోహద పడుతుందని అభిప్రాయపడ్డారు.

## కామన్ సివిల్‌కోడ్ - జాతీయ సమైక్యత

ఆ తరువాత 1985లో సుప్రీం కోర్టు న్యాయమూర్తి జస్టిస్ చిన్నప్ప రెడ్డి ఒక కేసులో తన అభిప్రాయాలను ప్రకటిస్తూ - కామన్ సివిల్ కోడ్ ఒక అనివార్యమైన తక్షణ అవసరం అనడానికి ఈ కేసు మరో ఉదాహరణ అన్నారు.

The present case is yet another which focuses.... on the immediate and compulsive need for a uniform civil code.

ఇదే విషయాన్ని మరింత వివరంగా, తాకీదు చేస్తున్న ధోరణిలో సుప్రీం కోర్టు ద్విసభ్య ధర్మాసనం మే 1995లో ఓ తీర్పు సందర్భంగా చెప్పింది. ఈ డివిజనల్ బెంచ్ సభ్యులు జస్టిస్ కులదీప్ సింగ్, జస్టిస్ ఆర్.ఎమ్. సహాయ్‌లు. సంవిధానంలోని అధికరణ 44 ప్రకారం యూనిఫామ్ సివిల్ కోడ్‌ను విధించడం జాతీయ సుస్థిరత వైపు ఒక నిర్ణయాత్మక ముందడుగు అనీ, దేశంలో యూనిఫామ్ సివిల్ కోడ్ విధింపు ఆలస్యం చేయడం ఏ విధంగానూ సముచితం కాదని వ్యాఖ్యానించారు.

To introduce a Uniform Personal Law (is) a decisive step towards national consolidation... there is no justification whatsoever in delaying indefinitely the introduction of a Uniform Personal Law in the country. (p. 22)

## 44వ అధికరణ

పై వ్యాఖ్యలు, అభిప్రాయాలు అన్నింటికీ ఆధారం సంవిధానంలోని 44వ అధికరణ. ఈ అధికరణ సంవిధానంలోని నాలుగవ భాగంలో ఉంది.

ఈ భాగంలో ఆదేశిక సూత్రాలు ఉన్నాయి. ఇందులోని 37వ అధికరణలో విశదీకరణ ఉంది. ఈ భాగంలోని అధికరణలు న్యాయస్థానాల ద్వారా విధింపబడేవి కావని పేర్కొన్నారు. ఈ భాగంలోని అధికరణలన్నీ ప్రభుత్వానికి, రాజ్యానికి సంబంధించినవి. కాబట్టి సుప్రీంకోర్టు న్యాయమూర్తులు మాటి మాటికీ 44వ అధికరణ ఆధారంగా యూనిఫామ్ సివిల్ కోడ్ సమస్యను ప్రస్తావించడం తమకు సంబంధంలేని వ్యవహారంలో జోక్యం చేసుకోవడమే అవుతుంది. అందుకే జనతాదళ్ ఈ తీర్పుపై వ్యాఖ్యానిస్తూ ( ది పయనిర్ 15 మే 1995) న్యాయస్థానాలు తమ హద్దులు దాటి పార్లమెంటులో ప్రవేశించడంగా పేర్కొంది.

ఈ నేపథ్యంలో ది హిందూస్తాన్ టైమ్స్ (12 మే 1995) ఈ తీర్పును విశ్లేషిస్తూ భారతదేశ సుప్రీం కోర్టు ఇటీవలి కాలంలో దేవదూతలు సయితం వెనుకాడే ప్రాంతాలలోకి చొచ్చుకు పోవాలన్న ధోరణిని విపరీతంగా కనబరు స్తోంది. అని సంపాదకీయాన్ని ప్రారంభించింది.

స్వయాన సంవిధానం ప్రకారం యూనిఫామ్ సివిల్ కోడ్‌కు శాసన రూపం ఇవ్వడమన్నది పూర్తిగా ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారం. ఇక ప్రభుత్వ ధోరణిని చూస్తే- 1956లో అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్పష్టంగా ఇలా అన్నారు:

“దీన్ని అమలు పరచే సముచిత సమయం భారతదేశంలో ఉందని నేను ప్రస్తుతం భావించడం లేదు.”

ఇవే మాటలు ఆ తరువాత ఇందిరాగాంధీ కూడా అన్నారు. మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు కూడా ఈ మాటలే అన్నారు. (టైమ్స్ ఆఫ్ ఇండియా, న్యూఢిల్లీ 28 జులై 1995 పేజి 7).

యూనిఫామ్ సివిల్ కోడ్‌కు ఆచరణా రూపం ఇవ్వగలిగిన వాళ్ళు తగిన సమయం కాదని భావిస్తుండగా, దానితో ఎలాంటి సంబంధమూ లేనివాళ్ళు దాని గురించి ఉద్రేక పూరిత ప్రసంగాలు చేస్తున్నారు. ఇంత

కన్నా విచిత్రం ఏముంటుంది? ఈ ప్రసంగాలు, ప్రకటనలు అన్నీ కేవలం కాలానుగుణంగా వీచేగాలులే తప్ప మరేం కాదు.

## మత స్వేచ్ఛ కాదనలేని హక్కు

సంవిధానంలోని 44వ అధికరణను ఉటంకిస్తూ యూనిఫామ్ సివిల్ కోడ్ కావాలని వాదించే వాళ్ళు బహుశా సంవిధానంలోని 25వ అధికరణలో 44వ అధికరణకు నిరాకరణ కూడా ఉందన్న విషయాన్ని గమనించడం లేదు. భారత సంవిధానంలోని 25వ అధికరణ దేశ పౌరులందరికీ మనస్సాక్షిని అవలంభించే స్వేచ్ఛ, మతావలంబన స్వేచ్ఛ, మతప్రచార స్వేచ్ఛలను ఇస్తుంది. ఈ అధికరణ ప్రకారం పౌరులందరూ మనస్సాక్షిని అవలంబించే సమాన స్వేచ్ఛ కలిగి ఉన్నారు.

మతాన్ని ఎన్నుకోవడం అన్నది వ్యక్తి లేదా వర్గపు ఇష్టం మీద ఆధారపడి ఉంది. అందువల్ల 25వ అధికరణకు వివరణలో (Explanation) "సిక్కుల మత స్వేచ్ఛలో వాళ్ళు తమ మత విశ్వాసాల ప్రకారం కృపాణం (కత్తి) వెంట ఉంచుకోవడం కూడా ఉంది. సంవిధానంలో సాంస్కృతిక హక్కుల పేరిట ఇలా పేర్కొనబడింది. "భారత దేశ పౌరులలోని యే వర్గమైనా తనదైన ప్రత్యేక సంస్కృతి, భాషలను సంస్కరించుకునే హక్కు వారికి ఉంది." (అధికరణ 29) అంతేకాదు, సంవిధానంలోని మత స్వేచ్ఛ అధికరణ, పౌరులకు మౌలిక హక్కుల (Fundamental Rights) విభాగంలో ఉంది. కాగా 44వ అధికరణ సంవిధానంలోని ఆదేశిక సూత్రాలలోనిది. స్వయాన సంవిధానంలోని 37వ అధికరణ ప్రకారం ఆదేశిక సూత్రాలు మౌలిక హక్కులకు లోబడి ఉండాలి అంతేగాని స్వతంత్రంగా ఉండరాదు.

వాస్తవాలు ఇలా ఉంటే సంవిధానంలోని 44వ అధికరణను ఉటంకిస్తూ, యూనిఫామ్ సివిల్‌కోడ్‌ను శాసనం ద్వారా దేశంలో అమలు చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయడం సంవిధాన స్ఫూర్తికి విరుద్ధం. స్వయంగా సంవిధానం ప్రకారం ఇలాంటి శాసన చర్యను మతంతో జోక్యం చేసుకోకుండా

భాశించే వర్గం ఉన్నంత కాలం అలాంటి శాసనాన్ని చేయడం అసాధ్యం. ఒకవేళ పార్లమెంటు ఇలాంటి శాసనాన్ని చేసినా, దేశంలోని యే మత వర్గమైనా ఆ శాసనాన్ని సుప్రీం కోర్టులో సవాలు చేస్తే, సంవిధానాన్ని సమీక్షించవలసిన సుప్రీం కోర్టు నిస్సందేహంగా ఆ శాసనాన్ని నిర్వీర్యం చేస్తుంది.

సంవిధానంలోని మత స్వేచ్ఛ గురించిన అధికరణ సాదాసీదా అధికరణ కాదు. అది మానవ హక్కుల విశ్వజనీన ప్రకటనకు అనుగుణంగా ఉన్న అధికరణ. ఈ ప్రకటనను ఐక్యరాజ్య సమితి 1948లో జారీ చేసింది. ఐక్యరాజ్య సమితిలో భారత దేశం కూడా సభ్య దేశం. ఈ ప్రకటనలోని 18వ అధికరణలో, ప్రతి వ్యక్తికి మత స్వేచ్ఛ ఉంటుందన్న హామీ ఇవ్వబడింది. ఇందులో మతాన్ని మార్చుకునే స్వేచ్ఛ తనకు నచ్చిన మతాన్ని పాటించే స్వేచ్ఛా కూడా ఉన్నాయి.

ఈ అంతర్జాతీయ ప్రకటనపై భారత దేశం కూడా సంతకం చేసింది. కాబట్టి మత స్వేచ్ఛ అన్నది ప్రతి భారత పౌరునికి ఉన్నది. ఎలాంటి పరిస్థితిలోనూ ఎవ్వరూ కాదనలేనటువంటి స్వేచ్ఛ ఇది.

## మతం - పర్సనల్‌లా

పైన పేర్కొన్న సుప్రీం కోర్టు ద్విసభ్య ధర్మాసనం ఇచ్చిన 31 పేజీల తీర్పులో (1995 మే) ఈ విధమైన శాసన చర్యకు అవకాశాన్ని కల్పించడానికి గానూ పెళ్ళి, విడాకులనేవి మతానికి సంబంధంచినవి కావనీ, దేశ శాసనాలకు సంబంధించినవని పేర్కొంది. జస్టిస్ కులదీప్ సింగ్ తన తీర్పులో ఇలా రాశారు - నాగరిక సమాజాలలో మతానికి వ్యక్తిగత చట్టానికి మధ్య ఎలాంటి సంబంధమూ లేదా భావన సంవిధానంలోని 44వ అధికరణలో ఉంది. సంవిధానంలోని 25వ అధికరణ మత స్వేచ్ఛను ఇస్తుంది. కాగా 44వ అధికరణ సామాజిక సంబంధాలను పర్సనల్ లా నుంచి వేరుపరుస్తుంది.

Article 44 is based on the concept that there is no necessary connection between religion and personal law in a civilian society. Article 25 guarantees religious freedom where as

Article 44 seeks to divest religion from social relations and personal law.

ఇది ముమ్మాటికి ఆధారంలేని వాదన. మత పండితలందరి సమైక్య అభిప్రాయం ప్రకారం మతం అన్నది మూడు అంశాలకు సంబంధించినది. అవి : విశ్వాసం, ఆరాధన, నైతిక ప్రమాణాలు(Ethical values). నైతిక ప్రమాణాలలో స్త్రీ పురుష లైంగిక సంబంధాల సక్రమ రూపం కూడా నిస్సందేహంగా ఉంది. నికాహ్ అన్నది ఈ విధమైన నైతిక సమస్యకు సంబంధించినదే. అందువల్ల నికాహ్ అన్నది కచ్చితంగా మత పరిధిలో ఉన్న అంశం.

మతం, వ్యక్తిగత చట్టాల మధ్య సంబంధం ఎంత స్పష్టంగా ఉందంటే చివరికి సుప్రీం కోర్టు డివిజనల్ బెంచ్ తీర్పులోనూ ఇది ప్రతి ఫలించింది. న్యాయమూర్తి ఆర్.ఎన్. సహాయ్ తన ప్రత్యేక తీర్పులో ఇలా రాశారు - పెళ్ళి వారసత్వం, విడాకులు, మత మార్పిడి, ఇవన్నీ స్వభావం రీత్యా మత విశ్వాసం లాంటివే. మతంలో ఆరాధన ఎలాంటిదో, అగ్ని ముందు ఏడు ప్రదక్షిణలు చేయడం, లేదా ఖాజీ సమక్షంలో అంగీకారం తెలుపడం అన్నవి కూడా అలాంటిదే.

Marriage, inheritance, divorce, conversion are as much religious in nature and content as any other belief or faith. Being round the fire seven rounds or giving consent before Qasi are as much matter of faith and consciene as the worship itself.

వాస్తవమేమంటే నికాహ్ (పెళ్ళి)ని మత విశ్వాసాల నుంచి ఎంత ప్రయత్నించినా వేరుపరచడం అసాధ్యం. పెళ్ళి, విడాకుల వ్యవహారాలు మత వ్యవహారాలు అయినట్లయితే సంవిధానంలోని 25వ అధికరణ ప్రకారం మత వర్గాలకు లభిస్తున్న హక్కును యే ప్రభుత్వము యే సంస్థ కబళించలేదు. మత వర్గం ఇష్టానికి వ్యతిరేకంగా, మత వ్యవహారంలో జోక్యం చేసుకునే విధంగా శాసనం చేయడం కుదరదు.

# కామన్ కోడ్ - జాతీయ సమైక్యత

కామన్ సివిల్ కోడ్ వల్ల సాధించే లక్ష్యం ఏమిటి? కామన్ సివిల్ కోడ్ కేవలం కామన్ సివిల్ కోడ్ కోసమే అడుగుతున్నారని ఎవరూ అనలేరు. (Common code for sake of common Code) మరి ఈ కామన్ కోడ్ అసలు లక్ష్యం ఏమిటి? కామన్ సివిల్ కోడ్ కావాలని వాదించే వాళ్ళందరూ ముక్తకంఠంతో ఘోషిస్తున్న లక్ష్యం ఒక్కటే. అదేమంటే, కామన్ సివిల్ కోడ్ ద్వారా ప్రజలలో పరస్పర సాన్నిహిత్యం సాధ్యపడుతుంది. జాతీయ సమైక్యత సాధించడానికి సహాయపడుతుంది. కామన్ సివిల్ కోడ్ ప్రజలలో కామన్ ఫీలింగ్స్ సృష్టిస్తుంది. ఆ విధంగా గత యాభై ఏళ్ళుగా మనం అభిలషిస్తున్న దృఢమైన ఇండియన్ నేషన్ రూపుదిద్దుకొంటుంది.

కాని, ఈ వాదన అంతా కవితాత్మకంగా కనబడుతుంది. వాస్తవాలు తక్కువ. కామన్ సివిల్ కోడ్‌కు కామన్ ఫీలింగ్స్‌కు మధ్య 'కామన్' తప్ప మరేది కామన్‌గా లేదు. అయినా కామన్ కోడ్ ద్వారా కామన్ ఫీలింగ్స్ వెల్లివిరుస్తాయని ఊహించారు. నిజానికి ఈ రెంటి మధ్య ఎలాంటి సంబంధమూ లేదు. వాస్తవాలను పరిశీలిస్తే ఈ వాదన పూర్తి ఆధారరహితంగా కనబడుతుంది.

జస్టిస్ కులదీప్ సింగ్ తన తీర్పులో ఇలా రాశారు - భారత ప్రభుత్వం హిందువుల సాంప్రదాయిక చట్టానికి స్మృతి రూపం ఇచ్చే ప్రయత్నాలు చేసింది. హిందూ మ్యారేజి యాక్ట్ 1955, హిందూ సక్సెషన్ యాక్ట్ 1956, హిందూ మైనారిటి అండ్ గార్డియన్‌షిప్ యాక్ట్ 1956, హిందూ యడాప్షన్ అండ్ మెయిన్‌టెనెన్స్ యాక్ట్ 1956లను రూపొందించడం జరిగింది. విభిన్న ఆలోచనా ధోరణులలో, వివిధ మత గ్రంథాలలో పేర్కొనబడి ఉన్న హిందూ సాంప్రదాయక చట్టం స్థానాన్ని ఈ చట్టాలు ఆక్రమించుకొన్నాయి. ఈ ఆధునిక చట్టాలు పాత వాటన్నింటికీ ఒక యూనిఫామ్ సివిల్ కోడ్ స్థాయికి చేర్చాయి. దేశ ప్రజలలో 80 శాతం కన్నా ఎక్కువ మంది ఒకే సివిల్ కోడ్ క్రింద ఉన్నప్పుడు, పూర్తి దేశంలో కామన్ సివిల్ కోడ్ విధింపుకు ఆలస్యం చేయడానికి తగిన కారణమేదీ లేదు. (పేజీ 2) అంతేకాదు ఆయన ఇంకా ఇలా రాశారు.

సంవిధానంలోని 44వ అధికరణ క్రింద ఇవ్వబడిన ఆదేశాల అమలుకు ఇంకా ఎంత సమయం భారత ప్రభుత్వానికి కావాలి? హిందువుల సాంప్రదాయిక చట్టం, హిందువుల పర్సనల్ లా - ఇందులో వారసత్వం, దత్తత, పెళ్ళి తదితర వ్యవహారాలు ఉన్నాయి. ఇది ఎప్పుడో అంటే 1955-56లో శాసనరూపం దాల్చింది. ఇక ఇప్పుడు దేశంలో యూనిఫామ్ సివిల్ కోడ్ విధింపును ఆలస్యం చేయదగని కారణమేది లేదు. పెళ్ళి, దత్తత, తదితర వ్యవహారాలకు సంబంధించిన హిందూ పర్సనల్ లా కూడా క్రైస్తవ, ముస్లిం పర్సనల్ లాల మాదిరిగానే అతి పవిత్రమైనదిగా భావింపబడేది. కాని, హిందువులు, వారి సహచరులయిన సిక్కులు, బౌద్ధులు, జైనులు జాతీయ సమైక్యత, సమగ్రతల కోసం తమ మనోభావాలను అణచివేశారు. భారత సంవిధానం, దేశమంతటా ఒక కామన్ సివిల్ కోడ్ విధించాలని తాకీదు చేస్తున్నప్పటికీ కొన్ని వర్గాలు ఇప్పటికీ ఇలా చేయలేదు. (పేజీ 21-22)

పైన పేర్కొన్న జస్టిస్ కులదీప్‌సింగ్ తీర్పులోని ఈ పంక్తులను పరిశీలిస్తే, ఆయన దృష్టిలో దేశంలోని 80 శాతానికి పైబడి ప్రజలు ఒక సివిల్ కోడ్ పరిధిలోకి తేబడ్డారు. ఆ సివిల్ కోడ్‌ను పూర్తి ప్రజలందరికి వర్తింపజేసి యూనిఫామ్ సివిల్ కోడ్‌గా మార్చాలని న్యాయమూర్తి కోరుతున్నారని స్పష్టమవుతోంది. 80 శాతానికి పైబడి ప్రజలు అభిలషణీయ చట్టం పరిధిలోనే ఉన్నప్పుడు మరి ఆ చట్టం సాధిస్తుందని గొప్పగా చెప్పబడుతున్న ఫలితాలెక్కడ?

నేడు కూడా జాతీయ సమైక్యతకు నష్టం కలిగించే చర్యలు అన్ని స్థాయిల్లోనూ జరుగుతున్నాయి. ప్రజలలో నేషనల్ కారెక్టర్ అన్నది లేదు. అసెంబ్లీ, పార్లమెంటు సమావేశాలలో హంగామాలు, గలాభాలు జరగడం, కార్యక్రమాలు స్తంభించడం మామూలయ్యింది. గ్రామాలలో, పంచాయితీలలో మునుపటికన్నా ఎక్కువగా ఘర్షణలు కలహాలు సంభవిస్తున్నాయి. న్యాయస్థానాలలో తగాదాల కేసులు గుట్టలుగా పడివున్నాయి. విభిన్న వర్గాల మధ్య కన్నా ఎక్కువగా ఒక వర్గంలోని విభిన్న సమూహాల మధ్య ఘర్షణలు జరుగుతున్నాయి. అనేక రాష్ట్రాలలో ప్రాంతీయ జగడాలు మామూలయ్యాయి. అనేక రాష్ట్రాలలో వేర్పాటు

ఉద్యమాలు నడుస్తున్నాయి. రాజకీయ పార్టీల సివిల్ చట్టం ఒక్కటే. కానీ ఈ పార్టీల మధ్య భారీస్థాయిలో సాగుతున్న పోరాటాలు దేశ వ్యవస్థనే కుదుపుతున్నాయి.

స్వయాన పైన పేర్కొన్న సుప్రీం కోర్టు న్యాయమూర్తుల తీర్పు ప్రకారం, అసలు సమస్య కామన్ సివిల్ కోడ్ విధింపునకు సంబంధించినది కాదు. నిజానికి కామన్ సివిల్ కోడ్ ఉన్నా ఫలితాలు కానరాకపోవడం గురించి సమస్య ఇది. ఈ నేపథ్యంలో మనం మరో కొత్త మార్గాన్ని అన్వేషించాలే తప్ప విఫలమయిన మార్గానే ముందుకు సాగాలని పట్టుబట్టి మరింత సమయాన్ని వ్యర్థం చేయడం ఉచితం కాదు.

## బ్రిటీషు వాళ్ళు చేసిన విభజనలు

నేడు పెద్ద యెత్తున చర్చ జరుగుతున్న కామన్ ఫీలింగ్ అన్నది గతంలో శతాబ్దాలుగా మన దేశంలో సర్వసాధారణంగా ఉండేది. దేశంలోని విభిన్న వర్గాలు కలసి మెలసి, ప్రేమాభిమానాల వాతారణంలో జీవించే వారు. వాస్తవానికి ఆ కాలంలో కామన్ సివిల్ కోడ్ లాంటిది యేదీ దేశంలో లేదు. ప్రతి వర్గానికి దానిదైన ప్రత్యేక గుర్తింపు ఉండేది. ప్రతి వర్గం పెళ్ళి తదితర వ్యవహారాలను తన మత ఆచారాల ప్రకారం జరిపేది. అయినప్పటికీ జాతీయ సమైక్యత ఆ కాలంలో పూర్తిగా కానవచ్చేది.

భారత సమాజంలోని ఈ సమతుల్యాన్ని దెబ్బతీసిన కారణం కామన్ సివిల్ కోడ్‌లేకపోవడం కాదు. అది బ్రిటిషు వారు అనుసరించిన కుయుక్తి. లెఫ్టినెంట్ జనరల్ కోక్ ప్రతిపాదించిన 'విభజించు పాలించు' సిద్ధాంతం వల్ల భారత సమాజంలో సమతుల్యత దెబ్బతిన్నది.

Divide and rule అంటూ జనరల్ కోక్ ప్రతిపాదించిన సూత్రం ఈ అవాంఛనీయ స్థితికి కారణం. నిజానికి ఇది 1862-63లలో భారత దేశానికి వైస్రాయ్‌గా ఉన్న జేమ్స్ బ్రూస్ ఎల్గిన్ కాలంలోనే ప్రారంభమయ్యింది. బ్రిటిష్

ప్రభుత్వానికి సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా ఉన్న 'ఉడ్' లండన్ నుంచి భారత దేశంలో ఉన్న వైస్రాయ్‌కి ఉత్తరం రాస్తూ -

We have maintained our power in India by playing one part against the other and we must continue to do so. Do all you can, therefore to prevent all having a common feeling.

"భారత దేశంలో ఒక వర్గాన్ని మరొక వర్గంతో తలపడేలా చేసి మనం అధికారాన్ని కాపాడుకొంటూ వచ్చాము. మనం ఇలానే చేస్తూ ఉండడం అవసరం. అందువల్ల ప్రజలలో 'కామన్ ఫీలింగ్' ఏర్పడకుండా అడ్డుకోవడానికి చేయగలిగిన దంతా చేయండి. (ది హిందుస్తాన్ టైమ్స్ 3 మార్చి 1995)

బ్రిటీషు వారి ఈ విధానం వల్లనే భారత దేశంలోని జాతీయ సమైక్యతా భావనలు చెల్లాచెదరయ్యాయి. బ్రిటీషు వాళ్ళు భారత ప్రజల మధ్య విద్వేషం వ్యాపింపజేయడానికి దొరికిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకొన్నారు. ప్రభుత్వ పరంగా అందుబాటులో ఉన్న వనరులన్నింటినీ ఉపయోగించి ప్రజల మధ్య పరస్పర వైషమ్యాలు, విద్వేషాల అంతర్యుద్ధ పరిస్థితి ఏర్పడేలా చేశారు. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యానంతరం కూడా ఈ అగ్గిఆరలేదు. దాని జ్వాలలు నేటికీ సమాజాన్ని దహిస్తూనే ఉన్నాయి. కామన్ ఫీలింగ్ లేకపోవడానికి అసలు కారణం ఇది. అంతేకాని యూనిఫామ్ సివిల్ కోడ్ ఉండడం లేకపోవడంతో ఈ సమస్యకు ఎలాంటి సబంధమూ లేదు.

## సమాన వ్యక్తి గత చట్టం సమానత్వాన్ని సాధించే మార్గం కాదు

సమానత్వం, సమైక్యతలకు, కామన్ సివిల్ కోడ్‌కు ఎలాంటి సంబంధమూ లేదు. ఒకే సివిల్ కోడ్‌ను అనుసరించే వాళ్లు పరస్పరం ఘర్షణలకు, కలహాలకు పాల్పడిన సంఘటనలు అనేకం. ఉదాహరణకు ప్రాచీన భారతంలో, కౌరవ పాండవ వంశాల మధ్య బంధుత్వం కూడా ఉంది. అందరి సివిల్ కోడ్ ఒక్కటే

అయినప్పటికీ ఇరు వర్గాల మధ్య భీకర యుద్ధం జరిగింది. ఆ కథే మహాభారతం. ఢిల్లీలో గద్దెను ఆక్రమించుకోడానికి రానున్న ఎన్నికల్లో కిల్లర్ ఇన్‌స్టింక్ట్‌తో మహా భారతాన్ని ప్రారంభిస్తానని భారతీయ జనతా పార్టీ ప్రకటించింది. (టైమ్స్ ఆఫ్ ఇండియా 24 జులై 1995) ఈ కొత్త మహా భారతంలోని వైరి వర్గాల సివిల్ కోడ్ కూడా ఒక్కటే.

మొదటి ప్రపంచ యుద్ధం (1914-18)లో ఓ వైపున జర్మనీ, ఇటలీ తదితర దేశాలు ఉండగా, మరోవైపు బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన దేశాలు పోరాడాయి. ఇరు కూటముల మధ్య భీకర యుద్ధం జరిగింది. మరణించిన, తీవ్రంగా గాయపడిన వారి సంఖ్య 30 మిలియన్ల వరకు చేరుకుంది. ఈ యుద్ధంలో పోరాడిన రెండు కూటములు క్రైస్తవ మతాన్ని అవలంబించేవి. ఇరు కూటముల్లోని దేశాల్లో ఒకే విధమైన సివిల్ కోడ్ అమలులో ఉండేది. కాని, ఈ శాసన పరమైన సమానత్వం భయంకర యుద్ధాన్ని నివారించలేకపోయింది. అదే విధంగా రెండో ప్రపంచ యుద్ధం (1939-1945)లో ఓ ప్రక్క జర్మని, మరోవైపు బ్రిటన్ నాయకత్వాన్ని వహించాయి. ఈ ఇరు దేశాల సంస్కృతి, సివిల్ కోడ్ ఒక్కటే. అయినప్పటికీ ఇరుదేశాలు చరిత్రలోనే అత్యంత భయానక యుద్ధాన్ని నడిపాయి. ఇరుదేశాలు ఒకే సివిల్ కోడ్‌ను పాటిస్తున్నప్పటికీ ఈ యుద్ధం ఆగలేదు.

మాజీ భారత ప్రధాని ఇందిరాగాంధీని 1984లో కొందరు దారుణంగా హత మార్చారు. ఇక్కడ హత్యకు గురయిన ఇందిరాజీ పాటించే సివిల్‌కోడ్‌నే హంతకులూ పాటించేవారని గమనించాలి. పంజాబ్‌లో వేర్పాటువాద పోరులో ఇరువర్గాలు ఒకే సివిల్ కోడ్‌ను అనుసరిస్తున్నాయి. అనుదినం వార్తా పత్రికల్లో భార్యలపై భర్తల దౌర్జన్యాల గురించి వార్తలు చదువుతుంటాం. ఇక్కడ కూడా భార్యాభర్తలు ఒకే సివిల్ కోడ్ పాటించే వాళ్ళే మరి. న్యాయస్థానాలలో కోట్లాది మంది కన్యాదాతలు తీవ్ర ఆరోపణలతో కేసులు నడుపుతున్నారు. ఇందులో అత్యధిక శాతం కేసుల్లో ఇరు వర్గాల సివిల్ కోడ్ ఒక్కటే అయి ఉంటుంది.

వాస్తవమేమంటే, సమైక్యత, సహజీవనాలు సాధించడంలో కామన్ సివిల్ కోడ్ వల్ల ఒనగూడే లాభం ఏదీలేదని నేడు రుజవయ్యింది. ఇప్పుడు మళ్ళీ ఓ కొత్త శాసనాన్ని చేసి మళ్ళీ కొత్తగా కామన్ సివిల్ కోడ్‌లోని లాభాలు వెదకడానికి ప్రయోగాలు చేయడం అవసరం.

## మేధావుల వైఖరి

సుప్రీంకోర్టు డివిజనల్ బెంచ్ తీర్పు (10 మే 1995) పత్రికల్లో ప్రచురితమైన వెంటనే దేశవాసుల ప్రతిస్పందనలు, ముఖ్యంగా మేధావుల స్పందన బహుళంగా వెలుగులోకి వచ్చింది. కొందరు ఈ తీర్పును ప్రశంసించారు. ఇది ప్రస్తుత సమస్యలన్నింటికీ దివ్యౌషధంగా అభివర్ణించారు. మరి కొందరు ఈ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. విభిన్న కారణాల వల్ల కామన్ సివిల్ కోడ్‌ను వ్యతిరేకించారు. ఇలా వ్యతిరేకించిన వారిలో చెప్పుకోదగ్గ వారి పేర్లు వారి వ్యాసాలు క్రింద ఇస్తున్నాము.

1. Partha S. Ghosh - Politics of Uniorm Civil Code.
   The Hindustan times ` New Delhi, May 22, 1998
2. Kuldip Nayer - Living with religion
   The Statesman, New Delhi, May 31, 1995
3. H.M. Seervai - Uniform Civil Code Judiciary over steps its brief
   The Times of India - New Delhi, July 5, 1995
4. Balraj Puri - Personal Laws - Uniformity not essential.
   Indian Express New Delhi, July 6, 1995
5. K. C. Markandam : Civil Code, The Constitutional Perspectives
   The Hindustan Times, New Delhi June 19, 1995

వీరి వాదనలకు నమూనాగా శ్రీ బలరాజ్ పూరి వ్యాసంలోని కొన్ని భాగాలను ఇంగ్లీషు నుంచి అనువదించి ఇస్తున్నాము. ఆయన కామన్ సివిల్ కోడ్ అన్న భావనను పూర్తిగా నిరాకరించారు. ఆయన ఇలా రాశారు.

"సమానత్వం సంస్కరణల మధ్య మౌలికంగా ఎలాంటి సంబంధమూ లేదు. న్యాయమూర్తులు వాదించినట్లు జాతీయ సమైక్యత, సమగ్రతలకు కామన్ సివిల్ కోడ్ అవసరమేమీ కాదు. రాజ్యాలు వేరు వేరు చట్టాలు చేసుకోడానికి, ఒకే విధంగా వ్యవహరించనవసరంలేని వ్యవహారాల గురించి భారత సంవిధానం లోని రాజ్య జాబితాలో 66 ఎంట్రీలు ఉమ్మడి జాబితాలో 47 ఎంట్రీలు ఉన్నాయి. రాష్ట్రాల భౌగోళిక, సాంస్కృతిక వైవిధ్యం ప్రకారం రూపొందే అసమాన చట్టాల వల్ల దేశ సమైక్యత కు ఎలాంటి ప్రమాదమూ లేనప్పుడు. భౌగోళికంగా విభిన్నతను కలిగి ఉన్న మతాలు వర్గాల మధ్య శాసనాల సమానత్వం లేకపోతే వచ్చే ప్రమాదం ఏముంది? యే వర్గం కూడా మతం ప్రాతిపదికన తన కోసం ప్రత్యేక గుర్తింపును కోరలేదని చెబుతున్నారు. మరి మనం భాష ప్రాతిపదికన ప్రత్యేక గుర్తింపును అంగీకరించలేదా? భాష ప్రాతిపదికన దేశాన్ని పునర్వ్యవస్థీకరించుకోలేదా? అలాగే మండల్ సిఫారసుల ప్రాతిపదికన కుల ప్రాతిపదికన ప్రత్యేక రాజకీయ గుర్తింపునీయలేదా? అలాంటప్పుడు గౌరవ న్యాయమూర్తులు మత వర్గానికి ప్రత్యేక గుర్తింపునీయడానికి ఎందుకు నిరాకరిస్తున్నారు? ఇది లాజిక్‌కు విరుద్ధంగా ఉంది. సామాజికంగా, రాజకీయంగా ఆమోదించబడిన వాస్తవాలకు భిన్నంగా ఉంది. ఈ ప్రత్యేక గుర్తింపు కేవలం ఒక న్యాయమూర్తి ప్రకటన వల్ల మాయమైపోతుందా? (Indian Express 6 July 1995)

There is absolutely no logical connection between uniformity and reform. The case against the former is as unssailable, as it is for the later. Nor is uniform law imperative, as the judges argue, for the promotion of national unity and solidarity. There are a number of 66 entires in the state list and 47 in the concurrent list of the constitution on which states are

empowered to make laws without any obligation to conform to uniformity. If divorsity of laws, based on geographical, and cultural diversities of the states has not threatened the unity of the country, would it be threatened only if the diversities are of non territorial form as are religious communities.

Justice Kuldip singh has proclaimed that no community could claim to remian a seperate entity on the basis of religion. Have we not conceded seperate entities based on languages and reorganised the country on a linguistic basis. Have not cast based identities been recognised in the Mandal Principle and all identities cultural, tribal, caste, and religious acquired political legitimacy? Why does the honourbale judge singled out the claim of a religous community for a distinct identity? It defies logic and socially and politically the accepted reality. Can this identity disapper by a mere pronouncement of a Judge?

## గురుగోల్వాల్కర్ భావాలు

ఆరెస్సెస్ మాజీ సర్‌సంచాలక్ గురు గోల్వాల్కర్ 20 ఆగష్టు 1927న ఢిల్లీలో దీన్‌దయాల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్‌ను ప్రారంభించారు. ఆ సందర్భంగా మాట్లాడుతూ జాతీయ సమైక్యతకు కామన్ సివిల్ కోడ్ అవసరం లేదని ఆయన అన్నారు. ఆయన చేసిన ఆ ప్రసంగం మదర్‌లాండ్ (21 ఆగష్టు 1927)లో ప్రచురితమయ్యింది. ఆ తరువాత ఆర్గనైజర్ వారపత్రికలో (22 ఆగష్టు 1927) ఈ విషయంపై ఆయన ఇంటర్వ్యూ ప్రచురితమయ్యింది. గురుగోల్వాల్కర్ చెప్పిన మాటలు సంక్షిప్తంగా ఇవి:

"జాతీయ సమైక్యత అనే స్పృహను పెంపొందించడానికి కామన్ సివిల్ కోడ్ అవసరమని నేను భావించడం లేదు. ఇలాంటి శాసనపరమైన సమానత్వానికి

జాతీయ సమైక్యతతో ఎలాంటి సంబంధమూ లేదు. భారత దేశం ఎల్లప్పుడు వైవిధ్య భరిత దేశంగానే ఉంది. అయినప్పటికీ దీర్ఘకాలంగా మనం ఒక బలవత్తర మైన, సమైక్యజాతిగా నిలబడి ఉన్నాము. జాతీయ సమైక్యత కోసం మనకు సామరస్యం అవసరం. అంతేకాని సమానత్వం కాదు. నా అభిప్రాయం ప్రకారం మరీ విపరీత సమానత్వాన్ని మానవ ప్రవృత్తి ఇష్టపడదు. మనం దీర్ఘకాలిక జీవిత అనుభవాలను కలిగిఉన్నాం. మన అనుభవం ఏమంటే వైవిధ్యం, సమైక్యత రెండు కలసి ఉండగలవు. భారత సంవిధానంలో కామన్ సివిల్ కోడ్‌ను అభిలషించే ఒక అధికరణ ఉందన్నమాట నిజమే. అయితే రాజ్యాంగంలో ఉన్నంత మాత్రాన యేదీ వాంఛనీయంగా మారిపోదు కదా. ఏదిఏమైనా మన రాజ్యాంగం కొన్ని విదేశీ రాజ్యాంగాల సంగ్రహణం. దాన్ని భారత సమాజ అనుభవాల ప్రకారం రూపొందించలేదు.

ముస్లింలు కామన్ సివిల్ కోడ్‌ను వ్యతిరేకిస్తున్నారని అంటున్నారు. ఎందు కంటే వాళ్లు తమ ప్రత్యేక గుర్తింపును కాపాడుకోవాలనుకొంటున్నారు. తనదైన ప్రత్యేక గుర్తింపు కోరుకునే వర్గంతో నాకు ఎలాంటి వైరమూ లేదు. ఈ ప్రత్యేక గుర్తింపు గురించిన వాంఛ దేశ ప్రేమను దెబ్బతీయనంత వరకు వారితో నాకెలాంటి జగడం లేదు. అసలు సమస్య ఏమంటే, హిందువులకు ముస్లిములకు మధ్య సౌభ్రాతృత్వ భావన నెలకొల్పడం. నా అభిప్రాయం ప్రకారం ముస్లిములకు వారి జీవన విధానాన్ని అవలంబించే పూర్తి హక్కు ఉంది. అయితే వాళ్ళు దేశాన్ని, దేశ సంస్కృతిని ప్రేమించాలి. హిందువుల కోసం కూడా ఒక సివిల్ చట్టం రూపొందించడం అవసరం. వేలాది సంవత్సరాలుగా హిందువులలో విభిన్నతలు ఉన్నప్పటికి కలసి మెలసి జీవించలేదా!

నా మాటలు మరీ తాత్వికమైనవిగా అనిపించవచ్చు. కాని, యూని ఫార్మిటీ అన్నది జాతుల వినాశకారణం. మనిషి స్వభావం దీన్ని అభిలషించదు. ప్రతి ఒక్క జీవన విధానాన్ని రక్షించాలి. అయితే ఈ వైవిధ్యాలన్నీ జాతీయ సమైక్యతకు తోడ్పడాలి.

# ప్రకృతి

జేక్ దహేల్వి (1754-1789) ఉర్దూ భాషలో ప్రముఖ కవి. ఆయన రాసిన ఒక కవిత-

*రంగురంగుల పూలే తోటకు అందం*

*ఈ ప్రపంచంలో వైవిధ్యమే నయనానందం.*

ఇది ప్రకృతి శాసనం. మీరు ఏదైనా పూదోటలో నిలబడి పరిశీలిస్తే అక్కడి మొక్కలు, చెట్లు వైవిధ్యంగా, విభిన్నంగా కానవస్తాయి. ప్రతి మొక్క పూలు విభిన్న వర్ణాలలో శోభిస్తుంటాయి. పూదోట వైవిధ్యానికి ఉదాహరణగా కనబడుతుంది. చివరకు పక్షులు కూడా విభిన్న శబ్దాలను వెలువరిస్తూ పాటలు పాడుతుంటాయి. కోయిల కుహుకుహు రావాలు, బుల్‌బుల్ కిలకిలలు తోటలో ప్రతిధ్వనిస్తాయి. ఒక పక్షి ఒక విధమైన శబ్దం వెలువరిస్తే మరో పక్షి మరో విధంగా శబ్దం చేసి వింత సంగీతాన్ని సృష్టిస్తుంది.

ఈ వైవిధ్యం విశ్వంలో అన్నింటా కానవస్తుంది. అదే విధంగా మనుష్యుల్లో కూడా వైవిధ్యం ఉంటుంది. జీవశాస్త్ర, మనో విజ్ఞాన శాస్త్ర అధ్యయనాల ద్వారా ప్రతి మనిషి, మరో మనిషిని అన్ని విధాల విభిన్నంగా ఉంటాడని తెలిసింది. వేలి ముద్రలు మాత్రమే కాదు, జీవ కణాలు కూడా ఒక మనిషికి మరో మనిషికి వేరువేరుగా ఉంటాయి. ఒక మనిషి కళ్ళు మరో మనిషికి కళ్ళను పోలి ఉండవు. ఈ వైవిధ్యం కేవలం బాహ్య సౌందర్యానికే పరిమితం కాదు. ఈ వైవిధ్యం వెనుక ఒక వివేచన కనిపిస్తుంది. వాస్తవానికి ఈ వైవిధ్యం, విభిన్నతల పైనే మానవ అభివృద్ధి ఆధారపడి ఉంది. కొత్త కొత్త ఆవిష్కరణలు ముందుకు వస్తున్నాయి. ఈ వైవిధ్యం వల్లనే కొత్త కొత్త ఆలోచనలు పుడుతున్నాయి. ఇవి ఆలోచనా వికాసానికి తోడ్పడుతున్నాయి. ఈ వైవిధ్యం వల్లనే పరస్పర పోటీ ఏర్పడుతుంది. ఈ పోటీ మనిషి మేధో వికాసానికి ఎంతైనా తోడ్పడుతుంది. ఏదైనా సమావేశంలో సభ్యులందరి ఆలోచన ఒకే విధంగా ఉన్నట్లయితే ఆ సమావేశంలో కొత్త భావాలు

రూపుదిద్దుకొనే అవకాశంలేదు. ఏదైనా పరిశ్రమలో పనిచేసే ఇంజనీర్లు అందరూ ఒకే మూసలో తయారైన వారిలా ఉంటే వాళ్ళు కొత్త సాంకేతిక మార్పులను చేపట్టలేరు. సమాజంలోని రచయితలంతా ఒకేలాంటి వాళ్ళయితే నూతన రచనలకు ఆస్కారమే ఉండదు. దేశంలోని రాజకీయ వాదులందరూ ఒకే మూసలో రూపొందిన వాళ్ళయితే వాళ్ళు చెప్పుకోదగ్గ రాజకీయ ఫలితాలు సాధించలేరు.

వైవిధ్యం, విభిన్నత సర్వసాధారణ ప్రకృతి శాసనం. జీవితంలోని ప్రతి రంగంలోనూ ఈ శాసనం ఆచరణలో కనబడుతుంది. చివరకు ఎవరైనా బల గర్వంతో ఈ వ్యవస్థను మార్చి కొత్తది నిలబెట్టినా, ప్రకృతి సహజ స్వభావం సహించదు. కొత్త వ్యవస్థను కూలదోసి మళ్ళీ వైవిధ్యభరితమైన పాత వ్యవస్థనే పునరుద్ధరిస్తుంది.

## ఆచరణార్హం కాదు

వాస్తవమేమంటే, కామన్ సివిల్ కోడ్ అన్నది ఆచరణార్హతలేని కల మాత్రమే. దీన్ని రుజువు చేయగల కారణం స్వయానా సంవిధానంలో కనబడు తుంది. దీనికి ఉదాహరణ సంవిధానంలోని అధికరణ 44, అధికరణ 371ల తులనాత్మక అధ్యయనం ద్వారా ముందుకు వస్తుంది.

ఇంతకు ముందు పేర్కొన్నట్లు, రాజ్యాంగంలోని 44వ అధికరణలో దేశ ప్రజలందరికీ ఒకే యూనిఫామ్ సివిల్ కోడ్ రూపొందించాలని ఉంది. కాగా, సంవిధానంలో సంస్కరించబడిన 371వ అధికరణ ప్రకారం నాగాలాండ్‌లోని నాగాల మధ్య ఉన్న ధార్మిక, సామాజిక ఆచారాలు, వారి వద్ద ఉన్న వివిధ సాంప్రదాయిక చట్టాల గురించి పార్లమెంటు ఎలాంటి శాసనమూ చేయరాదు. నాగాలాండ్ రాష్ట్రంలో సాంప్రదాయిక చట్టాలు రాజ్యాంగబద్ధంగా అమలులో ఉంటాయి. నాగాలాండ్ శాసన సభ స్వయానా ఈ చట్టాలలో మార్పుల గురించి నిర్ణయిస్తే తప్ప.

No act of parliament in respect of (Naga customary law) shall apply to State of Nagaland unless the legislature Assembly of Nagaland by a resolution so decides (371-A)

"సంవిధానమునందేమియున్నప్పటికినీ, (నాగాల మత సమాజ ఆచారాలకు సంబంధించి) పార్లమెంటు చేసిన చట్టాలు ఏవియు అది నాగాలాండ్ రాజ్యమునకు వర్తింపవలెనని ఒక తీర్మానము ద్వారా నాగాలాండ్ శాసన సభ నిర్ణయిస్తే తప్ప ఈ రాజ్యమునకు వర్తింపరాదు"

ఈ రెండు అధికరణల మధ్య వైరుధ్యం కనడుతూనే ఉంది. ఈ వైరుధ్యానికి కారణమేమంటే, మన రాజ్యాంగ కర్తలు స్వయంగా ఒక సమగ్ర రాజ్యాంగాన్ని రూపొందించడానికి గాను కేవలం ఊహల ఆధారంగా అందులో అనేక విషయాలను ఒక్కచోట చేర్చారు. అందులో వాస్తవానికి ఎన్నడూ ఒకటి చేయదగని అంశాలు కూడా ఉన్నాయి. బహుశా ఈ కారణం వల్లనే రాజ్యాంగ రచనా సంఘం సభ్యులలో ఒకరైనా సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ రాజ్యంగ రచనా సంఘంలో ప్రసంగిస్తూ "భవిష్యత్తులో చట్ట నిర్మాణ సంస్థలు బహుశా యూనిఫామ్ సివిల్ కోడ్ విధించే ప్రయత్నం చేయవచ్చు లేక అలాంటి ప్రయత్న మేదీ చేయకపోనూ వచ్చు" అన్నారు.

The Future legislatures may attempt a uniform civil code or they may not (Sir Alladi Krishna Swamy Aayyar)

శాసనం అంటే మహోన్నతమైనదేమీ కాదు. మానవులకు సంబంధించిన అనేక ఇతర అంశాలలాగే, మానవ శాసనాలకు కూడా పరిమితులున్నాయి. ఒక పరిమితి తరువాత మానవ సమాజాలపై వాటి పట్టు సడలి పోతుంది.

1975లో అలహాబాద్ హైకోర్టు ఒక తీర్పు ఇచ్చింది. ఆ తీర్పులో ఇందిరా గాంధీ ఎన్నికను రద్దు చేయడమే కాక, ఆరేళ్ళపాటు ఇందిరాగాంధీ ఎన్నికలలో పాల్గొనరాదని బహిష్కరించింది. కాని ఏమయ్యింది? ఇందిరాగాంధీ ఎమర్జన్సీ ప్రకటించి ప్రభుత్వాన్ని పూర్తిగా చెప్పు చేతల్లోకి తెచ్చుకొన్నారు.

1986లో ఉత్తర ప్రదేశ్‌లోని ఒక న్యాయస్థానం తన తీర్పు ద్వారా బాబరీ మస్జిద్ తాళాలను తెరిపించింది. ఎందుకంటే, హిందువులకు అందులో పూజ చేసుకునే వీలు కల్పించడానికి. పైకి ఈ తీర్పు, హిందూ ముస్లిముల మధ్య సామరస్యాన్ని సాధించడానికి ఉద్దేశించినదిలా కనబడుతుంది. కాని తరువాత జరిగిందేమిటి? హిందూ ముస్లింల మధ్య సంబంధాలు పూర్తిగా పతనమయ్యాయి. భారత దేశం రాజకీయంగా ఆర్థికంగా నాశనమయ్యే స్థితికి చేరింది.

1985లో షాబాను కేసులో సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు, పైకి మహిళలకు న్యాయం చేకూర్చేదిలా కనబడింది. కాని తరువాత ఏం జరిగింది? రాజీవ్ ప్రభుత్వం ఒక చట్టాన్ని చేసింది. మరోవైపు భారతీయ జనతా పార్టీ ఈ వ్యవహారాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం నిస్సంకోచంగా వాడుకుంది. చివరకు పార్లమెంటులో బి.జె.పి. సభ్యుల సంఖ్య రెండు నుంచి 119కి పెరిగిపోయింది. అనేక రాష్ట్రాల్లో బి.జె.పి. ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

శాసనాల పరిమితులను రుజువుచేసే మరో ఉదాహరణ హిందూ కోడ్ బిల్లు 1956 ప్రకారం హిందూ పురుషులకు ఒకే పెళ్ళి చేసుకొనే అనుమతి ఉంది. కాని 1961 జనాభా లెక్కల ప్రకారం బహుభార్యత్వం హిందువులలోనే - ముస్లిములకన్నా ఎక్కువగా ఉంది.

**According to the Indian Census report of 1961 the percentage of Hindus having more than one wife was more than that of the Muslims.**

బ్రిటిష వాళ్ళు భారత దేశంలో తమ రెండు వందల ఏళ్ళ పరిపాలనా కాలంలో అయిదు వందల చట్టాలు చేశారు. మన రాజకీయ నాయకులకు 1947లో పాలనా పగ్గాలు లభించాయి. స్వాతంత్ర్యానంతరం ఈ 45 ఏళ్ళ కాలంలో అయిదు వేలకు పైబడి శాసనాలు చేయబడ్డాయి. కాగా సంస్కరణకు ఉద్దేశించిన చట్టాలు ప్రతికూల ప్రభావం చూపేవిగా తేలాయి. ఆ పిదప దేశంలో కలహాలు పెచ్చరిల్లాయి. అవినీతి విజృంభించింది. న్యాయాన్ని పొందటం

అత్యంత కఠినమైన పనిగా పరిణమించింది. స్త్రీల పరిస్థితి మరింత దిగజారింది. ఈ పరిస్థితులు సమాజాన్ని సంస్కరించవలసిన అవసరాన్ని సూచిస్తున్నాయే తప్ప మరిన్ని కొత్త శాసనాల అవసరాన్ని కాదు.

## మత మార్పిడి సమస్య

సుప్రీం కోర్టు డివిజనల్ బెంచి ముందున్న పిటీషన్‌కు యూనిఫామ్ సివిల్ కోడ్‌తో ఎలాంటి సంబంధమూ లేదు. ఈ పిటిషన్‌ను నలుగురు హిందూ మహిళల తరఫున, ఒక మహిళా సంస్థ 'కల్యాణి' దాఖలు చేసింది. ఈ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి సరళా మద్గల్ ప్రకారం ఆ నలుగురు హిందూ మహిళల సమస్య ఏమంటే, వారి భర్తలు ఇస్లామ్ స్వీకరించి రెండో పెళ్ళి చేసుకొన్నారు. పైగా మొదటి భార్యలకు విడాకులు ఇవ్వలేదు. వారి భర్తలు ఇస్లామ్ స్వీకరించింది కేవలం ఇస్లామీయ చట్టాల ఆసరాతో రెండో పెళ్ళి చేసుకునే ఉద్దేశంతో మాత్రమే. అందువల్ల వారి రెండో పెళ్ళిని రద్దుచేయవలసినదిగా ఆ మహిళలు కోరారు.

న్యాయస్థానం ఆ పిటిషన్‌ను విచారణకు స్వీకరించి హిందూ భర్తలు చేసుకున్న రెండో పెళ్ళిని రద్దుచేసింది. వారిని మొదటి భార్యలను స్వీకరించాలని ఆదేశించింది. ఈ తీర్పును ఇచ్చిన జస్టిస్ కులదీప్‌సింగ్ ఇలా రాశారు.

"మనం మన అసలు గమ్యాన్ని చేరుకోనంత వరకు, అంటే ప్రజలందరికి యూనిఫామ్ సివిల్ కోడ్ సాధించే వరకు, ఇక్కడ హిందూ భర్తలకు రెండోపెళ్ళి చేసుకోదలిచిన వారికి కావలసిన అవకాశం లభిస్తూ ఉంటుంది. మొదటి భార్య ఉన్నప్పటికీ, (రెండో పెళ్ళి చేసుకోదలచిన) హిందువు తాను ముస్లిమ్ అయ్యానని ప్రకటించి రెండో పెళ్లి చేసుకొంటాడు.

హిందువులకు ఒకే భార్య ఉండాలన్న చట్టం ఉన్నందు వల్ల ముస్లిమ్ చట్టం నాలుగు పెళ్ళిళ్ళకు అనుమతి ఇస్తున్నందు వల్ల, కుటిల స్వభావం గల హిందువు ఇలా చేసే అవకాశం ఉంది. హిందూ చట్టాల నుంచి తప్పించు

కునేందుకు రెండో పెళ్ళి చేసుకున్నప్పటికీ చట్టం చేతికి చిక్కకుండా ఉండాలని ఇస్లామ్ స్వీకరిస్తాడు."

ఈ వాదనను సమర్థిస్తూ "ది హిందుస్తాన్ టైమ్స్" 21 జూన్ 1995 సంచికలో మహిళల కాలమ్ క్రింద చిమన్‌లాల్ వర్మ ఇలా రాశారు.

"ఒక చట్టం నుంచి తప్పించుకోడానికి మరో చట్టాన్ని ఆసరా చేసుకునే వారు మతాన్ని దుర్వినియోగపరచడాన్ని అడ్డుకోడానికి యూనిఫామ్ సివిల్ కోడ్ అవసరం."

A uniform civil code is required to prevent the misuse of religion to evade the provisions of one law to take advantage of those another.

అయితే కొత్త శాసనం చేయడమన్నది పాత శాసనాల దుర్వినియోగాన్ని అడ్డుకోవడం అని చెప్పలేము. శాసనాలను దుర్వినియోగపరచే అవకాశం ఎల్లప్పుడు ఉంటుంది. పన్నుల ఎగవేతను నిరోధించడానికి అసంఖ్యాక చట్టాలు, నిబంధనలు ఉన్నాయి. అయినప్పటికి పన్నుల ఎగవేత నిరాటంకంగా సాగుతూనే ఉంది. ఇతర చట్టాలలో వాటి దుర్వినియోగాన్ని అడ్డుకొనడం సాధ్యం కానప్పుడు సివిల్ కోడ్ విషయంలో అదెలా సాధ్యపడుతుంది.

మరో విషయమేమంటే, యూనిఫామ్ సివిల్ కోడ్ విధించకుండా ఇలాంటి హిందువులను నిరోధించగలిగే అవకాశం లేనట్లయితే, గౌరవ న్యాయ మూర్తులు ఇలాంటి కుటిల స్వభావంగల హిందువులకు శిక్ష విధించి వారి రెండో పెళ్ళి చెల్లదని ఎందుకు ప్రకటించలేదు?

సుప్రీం కోర్టు తీర్పును పరిశీలిస్తే, గౌరవ న్యాయమూర్తులు ఇండియన్ పీనల్ కోడ్‌లోని 494వ అధికరణ ప్రకారం తమ తీర్పు వినిపించారు. దీన్నిబట్టి తెలిసేదేమంటే, ఇలాంటి అవసర చట్టాలు ఉన్నాయి. కుటిల స్వభావంగల హిందువులకు ఇక్కడ స్వేచ్ఛావకాశాలేవీ లేవు. ప్రస్తుతం ఉన్న చట్టాల ప్రకారం

కూడా అలాంటి అవకాశం లేదు. అలాంటప్పుడు కుటిల స్వభావం గల హిందువులను అడ్డుకోడానికి కొత్త చట్టం చేయవలసిన అవసరం ఏముంది?

The court ruling shows that no such inducement is available to an errant Hidu even under existing law . You do not need a civil code to deter him.

## 44వ అధికరణ లుప్తం చేయదగింది

పై వాదనను బట్టి, నేను పేర్కొన్న ఆధారాల దృష్ట్యా సంవిధానంలోని 44వ అధికరణ శాసన పరంగానూ, నైతికంగాను, సామాజికంగానూ అర్థంలేనిదని స్పష్టమవుతోంది. వాస్తవానికి అది కొందరు పెద్దల ఊహాగానం మాత్రమే. ఈ అధికరణను ఇప్పుడు సంవిధానం నుంచి తొలగించడమే సముచితం. ఎలాగైతే శరీరంలోని వ్యర్థ ప్రేగు (appendix)ను ఆపరేషన్ ద్వారా తొలగిస్తామో ఆ విధంగా దీన్ని లుప్తం చేయాలి.

ఈ విధంగా సంవిధానాన్ని సంస్కరించడం కొత్త యేమీ కాదు. సంవిధానంలో తరచూ అనేక మార్పులు చేర్పులు జరుగుతూ వచ్చాయి. ఉదాహరణకు ఆరంభంలో సంవిధానం వ్యక్తిగత ఆస్తిని పూర్తిగా ఆదరణీయ మైనదని పేర్కొని వ్యక్తిగత ఆస్తిని స్వాధీనం చేసుకునే హక్కు ప్రభుత్వానికి ఇవ్వలేదు. కాని 1955లో నాల్గవ సంవిధాన (సవరణ) చట్టం (the Constititon *(Fourth Amendment)* Act 1955) ఆమోదం పొందింది. ఆ చట్టం ద్వారా ప్రభుత్వానికి పౌరుల వ్యక్తిగత ఆస్తులను స్వాధీనం చేసుకునే హక్కు సంక్రమించింది. అంతేకాదు ప్రభుత్వం ఆస్తి యజమానికి ఇచ్చిన నష్టపరిహారం మార్కెట్ రేటు కన్నా తక్కువ ఉన్నప్పటికీ కోర్టుకెళ్ళే అవకాశం లేకుండా చేసిందీ చట్టం.

అదే విధంగా ఆదిలో సంవిధానం మాజీ రాజాలకు వ్యక్తిగత భరణం ఇచ్చింది. కాని 1971లో సంవిధానానికి 26వ సవరణ జరిగింది. ఫలితంగా భరణం ఇస్తున్న అధికరణ లుప్తం అయ్యింది. భరణం ప్రకారం మాజీలకు లభిస్తున్న సమస్త రాజ్యాంగ హక్కులను రద్దు చేయడం జరిగింది.

ఈ వాస్తవాల దృష్ట్యా సంవిధానంలోని 44వ అధికరణను సవరణ ద్వారా తొలగించాలని కోరడం ఏ విధంగానూ అనుచితం కాదు. ఇలా చేయడం వల్ల ఎలాంటి నష్టమూ లేదు. అంతేకాదు, సంవిధానంపై అనవసరంగా ఉన్న ఒక పెనుభారం తొలగిపోతుంది.

## యూనికల్చర్ నేషన్? మల్టీ కల్చర్ నేషన్??

భారత దేశంలో గత వందేళ్ళుగా రెండు విభిన్న దృక్పథాలుగల రాజకీయ వర్గాలు చురుకుగా ఉన్నాయి. నేడు ఈ వర్గాలు వేరు వేరు పేర్లతో పిలువబడు తున్నాయి. ఒక వర్గం లౌకిక భావాలపై దేశాన్ని నిర్మించాలని ఆలోచిస్తుంది. మరో వర్గం హిందూత్వ మూసలో దేశాన్ని తయారు చేయాలని యోచిస్తుంది. రెండు వర్గాల దృక్పథాలు పూర్తిగా విరుద్ధమైనవి. అయితే విచిత్రం ఏమంటే రెండు వర్గాలు కూడా భారత దేశంలో యూనిఫామ్ సివిల్ కోడ్ సమస్యపై ఏకాభిప్రాయాన్ని కలిగి ఉన్నాయి.

కాని, నిష్పక్షపాత దృష్టితో గనుక చూసినట్లయితే, యూనిఫామ్ సివిల్ కోడ్ ఈ రెండు వర్గాల దృక్పథాలకూ విరుద్ధమైనవి. ఈ వర్గాలు తమ దృక్పథాల్ని సిద్ధాంతాన్ని నిజాయితీతో అనుసరిస్తున్నట్లయితే, యూనిఫామ్ సివిల్ కోడ్ అన్న భావన ఊహను కూడా సమర్థించలేరు.

లౌకికవాదం అంటే – మత వ్యవహారాల్లో ప్రభుత్వం జోక్యం లేకుండడం. ప్రజలకు మత స్వేచ్ఛను ఇస్తూ, కేవలం ఉమ్మడి ప్రాపంచిక వ్యవహారాలలో అవసరమైన ఏర్పాట్లు నిర్వాహణ చూడడం. ఇది లౌకిక వాదానికి అంతర్జా తీయంగా అంగీకరించబడిన భావన. దీని ప్రకారమే భారత సంవిధానాన్ని తీర్చి దిద్దారు.

కొంతమంది సెక్యులరిజాన్ని నిర్వచిస్తూ స్వయాన సెక్యులరిజమ్ ఒక మతం అయినట్లు మిగిలిన మతాలన్నింటిని నిర్వీర్యం చేసి వ్యక్తిగత స్థాయినుంచి సామూహిక స్థాయి వరకు జీవితంలోని అన్ని రంగాలను దీని పరిధిలోకి తేవాలని

అంటారు. కాని ఈ వాదం అతివాదం. ఇలాంటి అతివాదులు ప్రతి మతం లోనూ, ప్రతి వ్యవస్థలోనూ ఉంటారు. స్వయాన ఇస్లామ్‌లోనూ ఇలాంటి అతి వాదులు ఉన్నారు, కాబట్టి ఇస్లామ్ అంటే రాజకీయాలు, యుద్ధాలు నిండి ఉన్న మతంగా వీరి వివరణల వల్ల చిత్రీకరించబడుతోంది. ఇది కేవలం అతివాదం. నిజమైన ఇస్లామ్ ఇది కాదు.

సెక్యులరిజం, యూనిఫామ్ సివిల్ కోడ్ ఈ రెండు ఒకదాని కొకటి విరుద్ధమైనవి. భారత దేశంలోని సెక్యులర్ వర్గం నిజమైన సెక్యులర్ వర్గం అయినట్లయితే యూనిఫామ్ సివిల్ కోడ్ అన్న ప్రస్తావన చేయదు. ఎందుకంటే వ్యక్తిగత పరిధిలో మత స్వేచ్ఛ అన్నది సెక్యులరిజంలోని మౌలిక సూత్రం.

ఇక రెండో వర్గం విషయానికి వస్తే ఇది హిందూత్వపై ఆధారపడి నిలబడాలనుకొంటుంది. ఈ వర్గం నిజంగానే హిందూత్వకు కట్టుబడి ఉన్నట్ల యితే, పౌరులందరిని ఒకే యూనిఫామ్ కోడ్ పరిధిలోకి తీసుకురావాలని కోరడం స్వయాన దాని దృక్పథానికి విరుద్ధమని ఈ వర్గం తెలుసుకోవాలి.

సర్వ ధర్మ సంభావన అన్నది హిందూత్వ మౌలిక సూత్రం. అంటే ధర్మాలు అన్ని సత్యమైనవే. హిందూయిజం వైవిధ్యంలో ఏకత్వాన్ని నమ్ముతుంది. హిందూత్వ ప్రకారం ప్రకటితమయ్యే పద్ధతులు వేరువేరుగా ఉంటాయి. కాని అంతర్గతంగా వాస్తవం ఒక్కటే ఉంటుంది. కాబట్టి హిందూ విశ్వాసం అంటే - అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించడం.

సివిల్ కోడ్ గాని మరో స్మృతి గాని అది బాహ్య ప్రవర్తనలకు సంబం ధించినది. అంతర్గత భావాలకు సంబంధించినది కాదు. కాబట్టి విభిన్న వర్గాల పర్సనల్‌లాలు తొలగించి అందరికీ ఒక స్మృతిని నిర్దేశించడం స్వయానా హిందూ సిద్ధాంతానికి వ్యతిరేకమైనది.

ప్రపంచంలోని అభివృద్ధి చెందిన దేశాలన్నింటా (ఉదాహరణకు బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్ మొదలైనవి) మల్టీ కల్చర్ నేషన్ అన్న భావన ప్రబలంగా ఉంది. సింగపూర్ లాంటి చిన్న దేశం మొదలు అమెరికా లాంటి పెద్ద దేశం వరకూ ప్రతి

చోటా ఈ సూత్రాన్నే అవలంబించి అభివృద్ధి సాధిస్తున్నారు. యూనికల్చర్ నేషన్‌ను రూపొందించే ప్రయత్నం జరిగిన మొదటి దేశం బహుశా సోవియట్ యూనియన్. అందుకోసం ప్రభుత్వ యంత్రాంగం సమస్త శక్తియుక్తులను వినియోగించింది. కాని, యూని కల్చర్ నేషన్ ఏర్పడలేదు సరికదా స్వయాన సోవియట్ యూనియన్ ముక్కలు చెక్కలు అయిపోయింది. ప్రపంచ చరిత్రలోని ఈ సంఘటనలు మన కళ్ళు తెరిపించడానికి చాలవా?

వాస్తవానికి ఈ వ్యవహారంలో సమానత్వం అన్నది చరిత్రతో సంబంధం కలిగి ఉంది. అంతేగాని చట్టంతో కాదు. ఏదైనా సమాజంలో చరిత్రగతిన సమాన సంస్కృతి చోటు చేసుకుంటే అక్కడ కామన్ కోడ్ కూడా ఏర్పడుతుంది. అంతకన్నా ముందు అసంభవం.

## జనాభాగోల

పెళ్ళి తదితర వ్యవహారాలు వ్యక్తిగత వ్యహారాలని అనేక మంది మేధావులు పలుమార్లు చెప్పారు. వ్యక్తిగత వ్యవహారాలలో సాంప్రదాయిక పద్ధతులే కొనసాగాలని యే సముదాయమైనా భావిస్తుంటే, దానిపై ఇతర సముదాయం అభ్యంతర పెట్టవలసిన అవసరం ఏముంది? అయినప్పటికీ కొందరు అతివాద రాజకీయ శక్తులు యూనిఫామ్ సివిల్ కోడ్ కోసం ఇంత గలాభా ఎందుకు చేస్తున్నట్లు? చివరకు రానున్న లోక్‌సభ ఎన్నికల్లో ఎన్నికల సమస్యగా యూనిఫామ్ సివిల్‌కోడ్‌ను ప్రచారం చేస్తామని కూడా అవి ప్రకటించాయి. (ది హిందూస్తాన్ టైమ్స్, 17 జూలై 1996) ప్రస్తుత పరిస్థితుల్లో యూనిఫామ్ సివిల్ కోడ్‌ను రూపొందించడం ఆచరణలో సాధ్యం కాదని వారికి కూడా తెలుసు. అయినా హంగామా ఎందుకంటే, నిజానికి దాని వెనుక అసలు ఉద్దేశ్యం యూనిఫామ్ సివిల్ కోడ్ కాదు. కేవలం యూనిఫామ్ సివిల్ కోడ్ పేరు చెప్పి రాజకీయ ప్రయోజనాలు సాధించుకునే ప్రాకులాట మాత్రమే. ఈ శక్తులు ప్రణాళికా బద్ధంగా వక్ర ప్రచారం చేస్తున్నాయి. భారత దేశంలో ముస్లిముల జనాభా వేగంగా పెరుగుతుందని, రానున్న శతాబ్దం మొదటి అర్థభాగంలో

ముస్లిములు ఇక్కడ అధిక సంఖ్యాకులు అయిపోతారని, హిందువులుతమ దేశంలో అల్పసంఖ్యాకులుగా మిగిలిపోతారని ప్రచారం చేస్తున్నారు.

ఈ వక్ర ప్రచారం కోసం వీళ్ళు ఒక మోసపూరితమైన వాదన వినిపిస్తున్నారు. అదేమంటే స్వాతంత్ర్యం తరువాత ఏర్పడిన ప్రభుత్వం హిందూ మ్యారేజి చట్టం 1955 ద్వారా హిందువులు ఒక భార్యను కలిగి ఉండాలని పరిమితి విధించింది. కాని, ముస్లిముల పర్సనల్ లా (1860) ప్రకారం వారికి నలుగురు భార్యలను కలిగి ఉండే హక్కుంది. ఈ వివక్ష కారణంగా హిందువుల కన్నా ముస్లిములు నాలుగు రెట్లు ఎక్కువ సంతానాన్ని కలిగి ఉంటున్నారు. దేశంలో హిందువుల జనాభా 1.2.4.5 గా పెరుగుతుంటే ముస్లిముల జనాభా 1-4-8-16గా పెరుగుతూంది. అంటూ ప్రచారం చేస్తూ, ఒక భయానక పరిస్థితిని చిత్రీకరించి చెబుతూ హిందువులలో తమ ఓటు బ్యాంకు ఏర్పరచుకునే ప్రయత్నం చేస్తున్నారు. హిందూ విరుద్ధ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటు వేసి దాన్ని పెకలించిపారేయమని హిందువులను ప్రేరేపిస్తున్నారు.

ఈ వక్ర ప్రచారం నిస్సందేహంగా ఆధారహితమైనది. సాధారణంగా ముస్లిములు ఒక పెళ్ళి చేసుకొంటారు. నా వయసు 73 సంవత్సరాలు, నాయీ సుదీర్ఘ జీవితంలో నేనూ నాలుగు పెళ్ళిళ్ళు చేసుకొన్న భారత ముస్లిమును ఒక్కడిని కూడా చూడలేదు. పైగా ఇలా పెళ్ళాడడం సాధ్యం కూడా కాదు. ఎందుకంటే ముస్లిములందరూ నాలుగేసి పెళ్ళిళ్ళు చేసుకోవాలంటే, ముస్లిముల్లో పురుషుల కన్నా స్త్రీలు నాలుగు రెట్లు ఎక్కువ సంఖ్యలో ఉన్నప్పుడే సాధ్యపడుతుంది. లేదా స్త్రీలను ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి చేసే కర్మాగారం అన్నా వారివద్ద ఉండాలి. కాని ప్రస్తుత ముస్లిమ్ సమాజంలో స్త్రీల సంఖ్య పురుషుల కన్నా ఎక్కువా లేదు, లేదా స్త్రీలను ఉత్పత్తి చేసే ఫ్యాక్టరీ కూడా లేదు. ఇలాంటి పరిస్థితిలో ముస్లిములలో ప్రతి వ్యక్తి నలుగురు భార్యలను కలిగి ఉండడం ఎలా సాధ్యం? శ్రీ బలరాజ్ పూరి వ్యాసంలోని ఓ పేరా గ్రాఫ్ ఈ విషయాన్ని చక్కగా వివరిస్తోంది అది :

ఈ భయానికి సంబంధించిన మొదటి అభియోగం, భార్యల సంఖ్య విషయంలో (ముస్లిమ్) శాసనం పూర్తిగా అమలువుతుందని జనాభా లెక్కలలో రుజువు కావడంలేదు. స్త్రీల హోదా విషయమై జాతీయ కమీషన్ నివేదిక ప్రకారం, ఇతర వర్గాల కన్నా ముస్లిముల్లో బహుభార్యాత్వం తక్కువ. ఇక రెండవ అభియోగం, బహుభార్యత్వం వల్ల ముస్లిముల జనాభా పెరిగి పోతుందన్నది పూర్తిగా తప్పుడు అభియోగం. సంతానాన్ని ఇవ్వగల స్త్రీల జనాభా ఎల్లప్పుడు ఒక స్థాయిలో ఉంటుంది కాబట్టి కొందరు పురుషులు ఒకటి కన్నా ఎక్కువ పెళ్ళిళ్ళు చేసుకుంటే ఇతర పురుషులకు భార్యలు దొరకరు. యే వర్గంలోనయినా బ్రహ్మచారుల సంఖ్య ఎక్కువ ఉన్నందువల్ల ఆ వర్గంలో సంతానం ఎక్కువకావడమన్నది జరుగదు. ఒక పురుషుడు నలుగురు భార్యలను కలిగి ఉన్నప్పటికన్నా నలుగురు పురుషులు నలుగురు భార్యలతో అధిక సంతానాన్ని ఉత్పత్తి చేయగలరు.

ఈ విధంగా చూస్తే బహుభార్యత్వం జనాభా పెరుగుదలను నిరోధించే పద్ధతి. అంతేగాని జనాభాను పెంచేది కాదు.

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 6 జులై 1996)

పైన పేర్కొన్న అతివాద రాజకీయ శక్తులు ఈసారి ఎన్నికల్లో ఓటర్ల ముందు, చూడండి సంవిధానంలో 44వ అధికరణ ఉన్నప్పటికీ సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చినప్పటికీ ముస్లిములు యూనిఫామ్ సివిల్ కోడ్‌కు సిద్ధంగా లేరు. ఇలాంటి చట్టం చేస్తే వారికి నాలుగు పెళ్ళిళ్ళు చేసుకునే అవకాశం ఉండదనీ తమ జనాభా పెంచుకొని, హిందువులను అల్పసంఖ్యాకులుగా మార్చే పథకం ఉందని భయపడుతున్నారు. కాబట్టి మాకు ఓటు వేయండి. మాకు అధికంగా అధికారం అప్పగించండి. మేము ఈ ప్రమాదాన్ని నివారిస్తాం" అంటూ నిస్సందేహంగా చెబుతారు కాని, ఇలాంటి వక్ర ప్రచారాలతో, అసత్య ప్రచారాలతో వాళ్ళు ఎన్నికలలో విజయాన్ని పొందలేరు. దేశంలోని అతిపెద్ద పత్రిక టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రతిరోజు మొదటి పేజీలో "సత్యానిదే అంతిమ విజయం" (Let truth hrevail) అను సహజ శాసనాన్ని ప్రకటిస్తోంది.

# సమానత్వం కాదు సర్దుబాటు

1954లో భారత పార్లమెంటు స్పెషల్ మారేజ్ యాక్టును ఆమోదించింది. దాని ప్రకారం స్త్రీ పురుషులు ఎలాంటి మత పరమైన ఆచార సంప్రదాయాలు లేకుండా ప్రత్యేక కోర్టుకు వెళ్ళి, ఒక మెజిస్ట్రేట్ ముందు వివాహ అంగీకారం తెలిపి చట్టబద్ధంగా భార్యాభర్తలయి పోతారు. కామన్ సివిల్ కోడ్‌ను సెక్యులర్ సూత్రాల ప్రకారం రూపొందించినట్లయితే అది ప్రస్తుత స్పెషల్ మారేజ్ యాక్ట్‌కు పొడిగింపు మాత్రమే అవుతుంది. ఈ స్పెషల్ మారేజ్ యాక్టు క్రింద ఎంత మంది పెళ్ళిళ్లు చేసుకుంటున్నారో తెలుసుకుందామని నేను ఢిల్లీలో పరిశోధన చేశాను. చాలా అన్వేషణ తరువాత నాకు ఇద్దరు మాత్రమే దొరికారు. ఒకరు హిందూ, మరొకరు ముస్లిమ్. ఈ ఇద్దరు ఎలాంటి మతచారాలు లేకుండా సాదాసీదాగా కోర్టుకెళ్ళి తమ పెళ్ళి రిజిష్టర్ చేయించుకొన్నారు. కాని కేవలం కొద్దికాలంలోనే ఈ రెండు పెళ్ళిళ్ళు విచ్ఛిన్నమైపోయాయి. ఇప్పుడు ఆ పురుషులు, స్త్రీలు వేరువేరుగా ఉంటున్నారు. మరింత పరిశోధన చేస్తే తెలిసిందేమంటే, ఈ వేర్పాటుకు కారణం 'ఇగోయిజం' అని తేలింది. చిన్నచిన్న విషయాలకే భార్యాభర్తల మధ్య తీవ్ర వాదోపవాదాలు జరిగేవి. ఈ వివాదాలు పెరిగి చివరకు వేర్పాటుకు దారి తీశాయి.

స్త్రీ పురుష సమానత్వం అన్న ఆధునిక భావన, కేవలం కాగితాలపై చాలా బాగుంటుంది. కాని, జీవితంలో అన్నిటి కన్నా అధికంగా కావలసినది సర్దుబాటు. అంతేగాని సమానత్వం కాదు. సమానత్వం అన్న భావన హక్కులను డిమాండ్ చేసే ధోరణిని పెంపొందిస్తుంది. సర్దుబాటు అన్న భావన ఇతరుల హక్కులను నిర్వర్తించడాన్ని ప్రోత్సహిస్తుంది. అందువల్లనే సమానత్వం భావనను ఒంటబట్టించుకొన్న భార్యాభర్తలు వివాదపడి విడిపోతుంటారు. కాగా సర్దుబాటు ధోరణి గలవారు ఒక మంచి కుటుంబాన్ని ఏర్పరచుకోగలుగుతారు.

నేను జపాన్ గురించి ఒక పుస్తకం చదివాను. ఆ పుస్తకం ప్రకారం జపాన్ స్త్రీ, పురుషులు తాము మరొకరి అధీనంలో ఉన్నట్లు భావిస్తారు. (I am under some one) ఈ భావన కారణంగా జపానీయులు సర్దుబాటు చేసుకోడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటారు. అమెరికా మహిళ అందరికన్నా ఎక్కువగా చెడు భార్య అయితే జపాన్ మహిళ అందరికన్నా మంచి భార్య అని నానుడి. దీనిక్కారణం- అమెరికా స్త్రీ సమానత్వ భావనను అధికంగా కలిగి ఉంటుంది. కాగా, అందుకు విరుద్ధంగా జపాన్ స్త్రీ సమానత్వం, అసమానత అన్న వాదన నుంచి పైకి లేచి, సర్దుబాటు ధోరణిని ప్రదర్శిస్తుంది. అందువల్లనే సంసార జీవితంలో అమెరికా మహిళ విఫలం అయ్యింది. జపాన్ మహిళ సఫలం అయ్యింది. అందువల్ల మంచి కుటుంబాన్ని ఏర్పరచడానికి మనం సర్దుబాటును ఎక్కువగా ప్రోత్సహించాలి. అంతేగాని పాశ్చాత్య సమానత్వ భావనను కాదు.

## హిందూ సంప్రదాయం

హిందువుల్లో వివాహాలు ఒకే నిర్దిష్ట పద్ధతిలో లేవు. హిందువుల్లో వందలాది విభిన్న వర్గాలున్నాయి. ప్రతివర్గం తనదైన సాంప్రదాయిక, లేదా ప్రాంతీయ ఆచారాలను పెళ్ళిళ్ళలో అనుసరిస్తుంది. ఉదాహరణకు ప్రముఖ క్రికెట్ క్రీడాకారుడు సచిన్ టెండూల్కర్ 25 మే 1995న బొంబాయిలో అంజలి మెహతాను పెళ్ళాడాడు. పత్రికల రిపోర్టు ప్రకారం వారి పెళ్ళి మహారాష్ట్ర సంప్రదాయం ప్రకారం జరిగింది. (పయనీర్ 26మే 1995)

స్పెషల్ మారేజ్ యాక్ట్ 1954 క్రింద వారి కోసం ఒక అధికరణ ఉన్నప్పటికీ నేటికి కూడా హిందువులు మత సంప్రదాయాల ప్రకారమే పెళ్ళి చేసుకుంటారు.

Almost all Hindus still solemnise their marriages through religious customs although there is a civil way out through the special Marriages Act of 1954. (The Hindustan Times, May 22, 1995)

ఇది యేదో యాధృచ్ఛికం కాదు. ఇది నిజానికి చాలా సహజమైన పరిణామం. పెళ్ళి వ్యవహారాలు పూర్తిగా వ్యక్తిగతమైనవి. ఇలాంటి వ్యవహారాలలో ప్రతి వర్గం తన వంశం లేదా సముదాయం. ఆచార సంప్రదాయాల ప్రకారం వ్యవహరిస్తుంది. ఇలాంటి వ్యవహారాలలో ఇదే పద్ధతి. ఇంతకు మించివేరే పద్ధతి ఆచారణ సాధ్యం కాదు.

## నేషనల్ కారెక్టర్-అసలు అవసరం

భారత దేశాన్ని ఒక సమైక్య, శాంతియుత, ప్రగతిశీల దేశంగా రూపొందించడానికి కావలసినది నేషనల్ కారెక్టర్. దేశంలో ఉన్న లోపాలు, కనబడుతున్న రుగ్మతలు అన్నింటికి కారణం ఒక్కటే. అదేమంటే, స్వాతంత్ర్యానంతరం దేశ ప్రజలలో నేషనల్ కారెక్టర్ సృజించబడలేదు.

జాతీయ ఆలోచన వ్యక్తిగత ఆలోచనకు విరుద్ధమైనది. అంటే, ప్రజలు వ్యక్తిగత ప్రయోజనాలకు ప్రాధాన్యం ఇచ్చేబదులు జాతి ప్రయోజనాలకు ప్రాధాన్యం ఇవ్వాలి.

అవసరమైనప్పుడు వ్యక్తిగత ప్రయోజనాలను వదలి జాతి ప్రయోజనాల కోసం అవసరమైన పద్ధతి పాటించాలి.

బయటి శక్తులు ప్రలోభ పెట్టి, ధనాశ చూపి కొనాలనుకొన్నా, దేశ ప్రేమ వ్యక్తిని లొంగకుండా దృఢంగా నిలబెట్టాలి. పన్నులు ఎగవేయడం వల్ల వ్యక్తిగత ప్రయోజనం సిద్ధిస్తున్నా, జాతి, ప్రయోజనం దృష్టిలో ఉంచుకొని పన్నులు చెల్లించాలి. కల్తీ సరుకులు అమ్మడం వల్ల వ్యక్తిగత లాభం ఎక్కువ లభించినప్పటికీ, అలా చేయరాదు. ఎందుకంటే దేశ ప్రగతి స్తంభిస్తుందన్న భావన మనిషిని నిరోధించాలి. వ్యక్తిగత సమస్యలు ఉన్నప్పటికీ జాతీయ ఆస్తులకు నష్టం చేకూర్చరాదు. పారిశ్రామిక ప్రగతిని అడ్డుకునే ప్రయత్నం చేయరాదు. ఎందుకంటే ఇలా చేయడం వల్ల దేశం నాశనానికి చేరువవుతుంది. ఎన్నికల్లో ఓడిపోతే ఓటమిని సహృదయంతో అంగీకరించాలి. ఎందుకంటే

ఓటమిని అంగీకరించక పోవడం వల్ల దేశ రాజకీయ వ్యవస్థ కలుషితమవుతుంది. బాధ్యతాయుత హోదాలో ఉంటే వ్యక్తిగత ప్రయోజనం కోసం కుంభకోణాలకు పాల్పడరాదు. ఇలా చేయడం వల్ల దేశ ఆర్థిక ప్రగతి దెబ్బతింటుంది. ప్రభుత్వాధికారాన్ని అందుకొంటే ఎల్లప్పుడు ప్రభుత్వాధికారంలో కొనసాగాలని భావించరాదు. ఇలాంటి భావం దేశ ప్రజాస్వామ్య నిర్మాణాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. సర్వనాశనం చేస్తుంది. రాజకీయ నాయకుడైతే ఎన్నికల ప్రయోజనాలు ఆశించి భిన్నవర్గాల మధ్య విద్వేషాన్ని రాజేయరాదు. ఇలా చేయడం వల్ల ఓటు బ్యాంకు ఏర్పడుతుంది. కాని, దేశ శాంతి సుహృద్భావాల బ్యాంకు దివాలా తీస్తుంది.

నిజమైన దేశభక్తి అంటే ఇది. దేశాన్ని అభివృద్ధి పరచడానికి అవసరమైనది ఇదే. కాని నేడు మన దేశంలో ఇది లేనేలేదు. దేశభక్తికి బదులు స్వీయభక్తి ఎక్కువ అయినట్లు కనబడుతోంది. సొంత ప్రయోజనాల కోసం ప్రతివాడు దేశ ప్రయోజనాలను పణంగా పెడుతున్నాడు. ఈ వ్యక్తిగత స్వార్థమే దేశాన్ని నేడు సంకట పరిస్థితుల్లో పడవేసింది.

కామన్ సివిల్ కోడ్ లాంటి వాటివల్ల దేశభక్తి సాధ్యపడదు. దేశభక్తి కోసం ప్రజల ఆలోచనలకు నిర్మాణాత్మక దిశను ఇవ్వడం అవసరం. దానికోసం మనం సమస్త వనరులను ఉపయోగించి ప్రజలను చైతన్య పరచవలసి ఉంది. చైతన్యాన్ని రగుల్కొలిపే, జాగృత పరచే ఒక సుదీర్ఘ ఉద్యమం నడుపవలసిన అవసరం ఉంది. ఇది నిస్సందేహంగా కష్టసాధ్యమైన పని. కాని దీనికి ప్రత్యామ్నాయం మరొకటి లేదన్నది కూడా గమనించాలి.

## విద్య

భారత సంవిధానంలోని ఆదేశిక సూత్రాలలో ఉన్న అధికరణలలో 45వ అధికరణ ప్రకారం, సంవిధానం అమలు ప్రారంభమైన పదేళ్ళలో పిల్లలందరి కోసం ఉచిత, నిర్బంధ విద్యను అందించాలని, పద్నాలుగేళ్ళ వరకు విద్యాభ్యాసాన్ని అందించాలని రాజ్యానికి సూచన చేసింది.

సంవిధానంలోని ఆదేశిక సూత్రాలలో ఈ అధికరణ అన్నింటి కన్నా ఎక్కువ ప్రాముఖ్యతగల అధికరణ అని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని ఆచరణలో చూస్తే ఈ అధికరణ అన్నింటికన్నా తక్కువ ప్రాధాన్యాన్ని పొందడం కనబడుతోంది. పదేళ్ళు గడిచిపోయినా ఈ అధికరణపై అమలు ఎందుకు జరుగలేదని ప్రభుత్వాన్ని అడగవలసిన అవసరాన్ని సుప్రీం కోర్టు గుర్తించనే లేదు.

భారత సంవిధానం 26 నవంబరు 1949న అమలులోకి వచ్చింది. అంటే నవంబర్ 1959కి ఇవ్వబడిన వ్యవధి ముగిసింది. కాని దేశంలోని యువకులందరిని అక్షరాస్యుల చేసే లక్ష్యం ఏ విధంగాను నెరవేరనేలేదు.

జాతి నిర్మాణంలో విద్య పాత్ర, కామన్ సివిల్ కోడ్ కన్నా ముఖ్య మైనది. విద్యతో పోల్చిచూస్తే కామన్ సివిల్ కోడ్ అసలు సమస్యేకాదు. అందువల్ల దేశ ప్రజలందరినీ, నూటికి నూరుశాతం అక్షరాస్యులుగా రూపొందించే కార్యక్రమానికి మనం అధిక ప్రాధాన్యత ఇవ్వవలసి ఉంది. ఇదికాక ఇతర అంశాలను లక్ష్యాలుగా చేసుకోవడమన్నది, అసలు విషయం నుంచి దృష్టి మళ్ళించడమే అవుతుంది. ఈ విధంగా ప్రధాన విషయాలను విస్మరించి, అంత ప్రధానం కాని అంశాలపై దృష్టి కేంద్రీకరించడం జాతిపట్ల నేరమే అవుతుంది. అంతేగాని జాతికి సేవ చేయడం కాదు.

విద్య అన్నది ఉద్యోగానికి సంబంధించినది కాదు. విద్య చైతన్యాన్ని ప్రేరేపిస్తుంది. మనిషిని సరియైన దిశలో ఆలోచించేవానిగా రూపొందిస్తుంది. సమాజంలో పదుగురికి ఉపయోగపడే మంచి సంఘటనలన్నీ, సరియైన ఆలోచన ధోరణిని అలవరచుకొన్న వారివల్లనే జరుగుతాయి.

సరియైన ఆలోచనా ధోరణి మనిషిలో దూరదృష్టిని పెంపొందిస్తుంది. భిన్నాభిప్రాయాలను ఎలా ఎదుర్కోవాలో నేర్పుతుంది. మనిషిలోని బలహీనతలను, తొలగించి వాటి స్థానే అనుకూల లక్షణాలను ఏర్పరుస్తుంది. ఆ

విధంగా మనిషి విచక్షణా జ్ఞానాన్ని పెంపొదించుకొంటాడు. బాహ్య లక్షణాల ద్వారా అంతర్గత వాస్తవాలను గ్రహించగల్గుతాడు. సరియైన ఆలోచనా తీరువల్ల సవ్యమైన ఆచరణలు ఉంటాయి. సవ్యమైన ఆచరణలే వ్యక్తిని లేదా వర్గాన్ని విజయ పథాన నడుపుతాయి. సమాజంలో సమైక్యత, సమగ్రతల వాతావరణాన్ని సృష్టించడానికి కావలసిన అసలు అవసరం ప్రజలు సరైన ఆలోచనా ధోరణిని కలిగి ఉంచడం. అంతేగాని -ప్రజల పెళ్ళి వ్యవహారాలు ఒకేలా ఉండడం కాదు.

సరియైన ఆలోచనా ధోరణి అంటే ఏమిటో తెలుసుకోడానికి ఈ సంఘటన ఉపయోగపడుతుంది.

స్వామి వివేకానంద (1863-1902)ను ఒక క్రైస్తవ సోదరుడు ఇంటికి ఆహ్వానించాడు. ఆ క్రైస్తవ సోదరుడు స్వామి వివేకానందుని పరీక్షించడానికి ఆయన్ను కలుసుకొన్న గదిలో టేబుల్‌పై అనేక మతగ్రంథాలు ఉంచాడు. హిందువుల పవిత్ర గ్రంథం రామాయణాన్ని అన్నిటికన్నా క్రింద ఉంచాడు. దానిపై అనేక మతాల గ్రంథాలు ఉన్నాయి. అన్నింటికన్నా పైన తన మతగ్రంథం బైబిల్ ఉంచాడు. స్వామి వివేకానంద ఆ గదిలో ప్రవేశించి నప్పుడు, ఆ క్రైస్తవ సోదరుడు పుస్తకాల వైపు చూపిస్తూ "వాటి గురించి మీరేమి చెబుతారు" అనడిగాడు. స్వామిజి పుస్తకాల క్రమాన్ని చూసి చిరునవ్వు నవ్వి- "ఫౌండేషన్ చాలా బాగా ఉంది" అన్నారు.

స్వామిజి కనుక అక్కడ ప్రతిష్టకు పోయి ఉంటే పూర్తి వ్యవహారం దెబ్బతినేది. ఆయన "నన్ను అవమానించడానికి పిలిచావా" అని అడిగి ఉంటే ఇరువురి మధ్య ఘర్షణ మొదలయ్యేది. ఇలాంటి ఘర్షణలు ముదిరితే చివరకు పోలీసుల్ని పిలవవలసిన పరిస్థితి కూడా రావచ్చు. కాని స్వామిజీ ఈ వ్యవహారాన్ని ప్రతిష్టకు సంబంధించిన వ్యవహారంగా పరిగణించే బదులు తేలికగా తీసుకొన్నారు. ఫలితంగా ఇరువురి మధ్య ఘర్షణకు బదులు చిరునవ్వులు వెల్లివిరిశాయి.

ఇలాంటి సౌహార్ధ సంఘటనకు ప్రేరణేమిటి? స్వామి వివేకానంద, ఆ క్రైస్తవుడు ఇరువురిలో వైవాహిక ఆచారాలు ఒకే విధంగా ఉన్నాయా? అలా లేవని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఒకరు హిందువు, మరొకరు క్రైస్తవుడును. హిందువుల, క్రైస్తవుల వైవాహిక సంప్రదాయాలు విభిన్నంగా ఉంటాయన్నది తెలిసిందే.

కాని, పై సౌహర్ధ సంఘటనకు కారణం స్వామివివేకానందలోని ఉన్నత విద్యాభ్యాసం ఆయన్ను అత్యంత చైతన్యవంతంగా రూపొందించింది. వ్యవహారాన్ని ప్రతికూలంగా మార్చేబదులు అనుకూలంగా ఎలా మలచాలో ఆయనకు బాగా తెలుసు. ఆయన ఆలోచించే కళ తెలిసిన వ్యక్తి. జీవిత విజ్ఞానాన్ని గ్రహించిన వ్యక్తి. భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, సామరస్యంగా ఎలా ఉండాలో తెలిసిన మనిషి. స్వామిజీలో ఉన్న ఆలోచన ఈ సౌహార్ధ సంఘటనకు కారణమయ్యిందే తప్ప కామన్ సివిల్ కోడ్ యేదీ దీనికి కారణం కాదు.

ముస్లిములారా!

చివరన నేను ముస్లిములకు విజ్ఞప్తి చేసేదేమిటంటే, సుప్రీం కోర్టు తీర్పు (1995) విషయంలో, గతంలో చేసిన తప్పులు ఈసారి చేయరాదు. గతంలో సుప్రీంకోర్టు తీర్పు (1995) విషయంలో ముస్లిములు చేసిన పొరపాట్లు మళ్ళీ పునరావృతం కారాదు. పదేళ్ళ ముందు షాబాను కేసులో ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పు తరువాత ముస్లిములు దేశవ్యాప్తంగా ఆందోళనలు ప్రారంభించారు. దీనివల్ల దేశంలోని అతివాద హిందూ శక్తులు ప్రయోజనం పొందాయి.

ఇప్పుడు మళ్ళీ ఈ శక్తులు ముస్లిములు ఆందోళనలు చేపట్టాలని ఎదురు చూస్తున్నాయి. ఈ విధంగా ముస్లిముల ప్రమాదం గురించి గగ్గోలు పెట్టి హిందువులలో తమ ఓటు బ్యాంకును పటిష్టం చేసుకోవాలని భావిస్తు న్నాయి. ప్రస్తుత పరిస్థితిలో సుప్రీంకోర్టు తీర్పు వల్ల ముస్లిములకు ఎలాంటి

ప్రమాదమూ లేదు. అయితే ముస్లిములు మళ్ళీ ఆందోళనా మార్గాన్ని అవలంబిస్తే, అప్పుడు కచ్చితంగా వారికే ప్రమాదం ఉందని చెప్పవచ్చు.

ఈ ప్రపంచంలో ప్రతివ్యక్తి ఎదుటివాడి బలహీనతల నుంచి లాభం పొందాలని కాచుకొని ఉంటాడు. అయిష్టమైన సంఘటన జరిగినప్పుడు మీరు మండిపడితే, తొందరపాటుతో వ్యవహరిస్తే ఎదుటివారికి కావలసిన అవకాశం ఇచ్చిన వారవుతారు. అందుకే ఖుర్ఆన్- "సహనం వహించాలి. ధైర్యస్తులైన ప్రవక్తల మాదిరిగా, ఇంకా వారి కొరకు తొందరపాటు చూపకండి" అని ఆదేశించింది. (అల్ అహ్ఖాఫ్-35) సహనం చూపడం వల్ల ఎదుటివారికి మీ బలహీనతల ద్వారా ప్రయోజనం పొందే అవకాశం దొరకదు. కాని అసహనం వల్ల మీరు ఎదుటివారి పన్నాగాలలో అవలీలగా పడిపోయి తప్పులు చేస్తారు.

యే వర్గంపైన అయినా సరే ఇతరులు కుట్ర పన్నినప్పటికీ, కుట్రకు గురికావడం, కాకపోవడం అన్నది స్వయానా ఆ వర్గం చేతుల్లోనే ఉంటుంది. ఈ వాస్తవాన్ని అర్థం చేసుకోవడంపైనే సాఫల్యం ఆధారపడి ఉంది.

-: సమాప్తం :-